# చిత్రప్రబోధము



ముద్రణము :

శ్రీ రామకృష్ణ ముద్రణాలయము

శ్రీకాకుళము.

1954








గ్రంథకర్త.

శతావధాని

[illegible]గుంటి వేంకట సూర్యప్రసాదరావు

పత్సవలసము — Via శ్రీకాకుళము.

ఓమ్

శ్రీ సద్గురు పరబ్రహ్మణే నమః

# చిత్తప్రబోధము





శతావధాని:

మాడుగుల వేంకట సూర్యప్రసాదరావు.

ప్రకటనకర్త:

మంతిని సత్యనారాయణ నాయుడు.





ప్రచురణ:

[redacted]

**1954**

మొదటికూర్పు : 500 ప్రతులు.

శ్రీ రామకృష్ణా ముద్రణాలయమున ముద్రితము.

వెల 1-0-0

ప్రతులకు :

శతావధాని,

మాడుగుల వేంకట సూర్యప్రసాదరావు,

ధర్మవరము, (Via) శ్రీకాకుళము.

# చిత్రప్రబోధము

కృతికర్త.

పండిత, కవిరత్న, ఆశుకవిచక్రవర్తి,
సువర్ణ ఘంటా కంకణ విరాజిత హస్త

మాడుగుల వేంకట
సూర్య ప్రసాదరావు. శతావధాని.

ధర్మవరము. Via శ్రీకాకుళము.



కృతిభర్త.

విద్వాన్
మంతిని సత్యనారాయణ
నాయుడు.

కురదాం.

Via పార్వతీపురము.

స్వర్గస్థయైన నా ద్వితీయ భార్య

## జగ్గమ సాధ్వీమణికి

స్మృత్యర్థ మర్పింపఁబడిన

# స్మారక చిహ్నము



శ్రీమ త్పావకభాతికాంగము ధరిత్రిన్ వీడి స్వర్లోకవీ
థీ మార్గంబున దేవతానతులఁ బ్రీతింగూడి వర్తించు నీ
ప్రేమన్ మర్వఁగలేక, యీ కృతిని నా విశ్వాసముం జూప నీ
కై ముద్రించి యొసంగినాఁడఁ గయికొమ్మా! జగ్గమాంబా సతీ!

ఉ॥ ఈ కృతిపుష్పరాజము సురేంద్రవనాంతరభాగచందనా
నోకహపుష్పరాజ మటు లూనుము నీ తలయందు సాధ్వి! త
త్ప్రకట సౌరభోల్లసితభావ మరంద రసాత్మబోధ మీ
లోక మెఱింగి నిత్యసుఖరూఢి నెసంగు; సతీశిరోమణీ!

శా॥ నీకున్ నీ కృతిపుష్పరాజమునకున్ నీ ప్రేమపున్ సూక్తికిన్
మాకున్ హైమవతీ మనోహరుఁడు శుంభత్ప్రేమచేతస్కుఁడై
ప్రాకట్యస్థిరశాంతి భాసురకళా భాగ్యాయురారోగ్య వి
ద్యాకీర్తుల్ దయసేసి సంతతము దీవ్యల్లీల రక్షించుతన్!

కురసాం,
తే 16—10—1953 ది

ఇట్లు,
కృతిభర్త
మంతిని సత్యనారాయణ నాయుఁడు.

# ఆశీస్సు.

---

సీ॥ సుజనసత్తముఁడు మా సూర్యప్రసాదరా
ట్కవి పెనిమంబుమైఁ గన్నబిడ్డ,
మంత్రినివంశ శుంభన్మణి సత్యనా
రాయణ కూర్మియిల్లాలు మిన్న,
సర్వజ్ఞమూర్తి నీశ్వరు విశ్వనాథు స
ద్భక్తిమై ధ్యానించు భక్తురాలు,
యుపనిషద్ధర్మముల్ కృపను బోధించి శ్రో
తల జ్ఞానమోదానఁ దెలచువిదుషి

మఱియుఁ జిత్రప్రబోధ సమాఖ్యనెసఁగి
శైవమతనిష్ఠ సజ్జనసంగతిఁ గని
ఘనతఁ గాంచిన యీ భవ్యకావ్యకన్య
ధరణి వరలుత మాచంద్ర తారకముగ,

విజయనగరము,
జ లి జ పీ ధి.
తే 10—12—1953 ది

ఇట్లు,
విబుధగణవిధేయుఁడు,
వడగ అప్పారావు కవి.

# పండితాభిప్రాయములు.

—:o:—

శా॥ శ్రీమన్మాన్యఘ్న ప్రసాదరాయకవి! నీ చిత్తప్రబోధంబు నే
నామూలాగ్రముఁ జూడఁదోఁచె నహహా! ఆధ్యాత్మికగ్రంధచూ
డామాణిక్యగతిన్ ముముక్షువద సంధానక్రియాద్యాగమ
స్తోమార్థప్రతిబింబసూచక మహత్సూక్తిప్రజోద్భాసియై.

కురుపాం. మంతిని సత్యనారాయణ నాయుఁడు,
తే 5-6-1953 ది.

  

చ॥ సుకవి కిశోర! నీ కయిత చొక్కపువెలిసి జాలువాఱి పా
ఠకులఁ బ్రమోదవార్ధి కెరటంబులఁదేల్చును చిత్తబోధపు
స్తకమణి, పాపకంటక పథంబునఁ దొట్రిలువారి కండయై
నికట భవఘ్నకల్పకపునీడను జేర్చుఁ; బ్రసాదరాట్కవీ!

ఉ॥ హాయిగఁ గీర్తిగేయముల నాంధ్రసరస్వతి నీ పితామహున్
శ్రీయుతు మాడుగెట్టున స్మరించుచుఁ బాడునుగా విచిత్ర రా
మాయణ కావ్యరాజమున నంకితుఁడౌట సెబాస్! ప్రసాదరా
ఫ్రూ! యిలువాసి వాసిలదొ? యుత్తమపాండితి నీదు సొమ్మెపో!

టెక్కలి, డబ్బీరు నారాయణ శర్మ,
తే 1-10-1953 ది. కవితా సరస్వతి - సాహిత్య విశారద.

  

మ॥ భళిరా! తావకచిత్తబోధకృతి, శుంభత్ప్రౌఢ సాహిత్య త
త్త్వ లసద్విద్వదనీకసంస్తవన పాత్రబ్రహ్మవిద్యామహో
జ్జ్వల సిద్ధాంత వచఃప్రబోధనకళా వైశిష్ట్యభావాఢ్యమై
చెలువొందెన్; భవదీయ భవ్యకవితాశ్రీకిన్ నమోవాకముల్.

బ్రహ్మపురము, శిష్యపురమాణువు,
తే 1-12-1953 ది. కవిభూషణ, దండా నరసింహాకవి.

చ॥ భళి భళి ! చిత్తబోధకృతి భక్తియు జ్ఞానము సంఘటించి ని
శ్చలమతిఁగూర్చి మోక్షపథసంగతిఁ బారకపాళికిచ్చు, ని
ర్మలతరకీర్తివైభవ విరాజితమై యిది సర్వకాలమున్
వెలయునుగాక లోకమున విశ్రుతలీలఁ బ్రసాదరాఘ్యయా !

బొంతలకోడూరు
తే 19-10-1953 ది.

శిష్యపరమాణువు, దున్న సత్యనారాయణ,
కవితానికేతన సభ్యులు.



క॥ ఉత్తమ కవితాపద్ధతి
ముత్తెంబులు పోహణించు మురువున సుకవీ !
చిత్తప్రబోధశతక ము
దాత్తగతి రచించి యశముఁదాల్చితివి భళీ !

మ॥ ధరణిన్ మానవజన్మమున్ ఫలిత మాత్మజ్ఞాన సంపాదనా
చరణంబున్, మఱి సాటిమానవులకా సత్యంబు బోధించినగా
పరతత్త్వంబు నెఱుంగఁజేయుటయు నోప్రజ్ఞానిధీ ! యియ్యోడన్
బరఁగించెన్ భవదీయకావ్యరచనాప్రావీణ్య మీయర్థమున్.

క॥ తాతయుఁ దండ్రియుఁ గృతి ని
ర్మాతలు గృతిపతులునగుట తత్కుల సం
జాతుఁడవగు నీ కరుదే
స్ఫీత కవిత్వ ప్రభావసిద్ధి ? కవివరా !

చ॥ అనఘ ! కవీంద్ర ! మాద్గుల కులాంబుధిచంద్ర ! ప్రసాదరాయ ! స
జ్జనగణగేయ ! తావక ప్రశస్త కవిత్వ కళాలవాల మీ
ఘనతర చిత్తబోధ శతకంబు వసుంధర విజ్ఞకోటి వ
క్త్ర నళినరాజిఁ దేజరిలుగావుత మా రవితారకంబుఁగన్.

విజయనగరము,
ఉల్లి వీధి.
తే 10—10—1953 ది

కవితాకోవిద
చింతలపూడి సన్యాసిరావు,
కౌముదీపరిషత్తు.

ఉ॥ ఖ్యాతిగలట్టి మాడ్గుల సదన్వయమం దుదయంబుఁగాంచి నీ
తాతలనుండివచ్చు కవితాద్రవిణం బిటు నీకుఁ బిత్ర్యమై
చేతికిరాఁగ భక్తిమెయిఁ జేకొని వడ్డికివేసి పెంచి, దు
ర్నీతిగ దుర్వ్యయమ్ము నొనరింపక దానిని చిత్తబోధ మన్
భూతలమందుఁ బెట్టి స్థిరభూతముగా నొనరించినాఁడవే!
నీతరమందెగాక యిది నీ కులమందుజనించువారి సా
మ్మైన తగుకీర్తిఁగూర్చుత మయారె! ప్రసాదకవీశ! యింకనీ
కైత విధంబుఁ దెల్పెదను గాంచఁగ నిష్కలుషప్రవాహమై
శీతలవాక్ప్రచార జలశీకరముల్ వెదచల్లి నీ ధరి
త్రీతలమెల్ల సత్ఫలపరీతముఁగా నొనరించు నెంతయున్.

విజయనగరము, — పండిత, ఆకుండి వేంకటశాస్త్రి,
తే 10-10-1953 ది. — రిటైర్డు సంస్కృత కళాశాలా ప్రధానాంధ్రోపాధ్యాయుఁడు
నిఘంటు కార్యస్థాన పండితుఁడు,

  

ఉ॥ మాయురె, చిత్తబోధకృతి మానితవైఖరిమీఱ భక్తిలో
కాయదమైనపద్ధతి శుభాయతబుద్ధి నువన్యసించి, ని
శ్శ్రేయసమార్గముం దెలియఁజేసి రచించితివౌర! శర్వపత్
తోయజభృంగమా! సుకవిధూర్జటి! మాడ్గు ప్రసాదరాడ్గురూ!

చ॥ మృదుపదపత్రి సంభరిత మేదురభావమరందయుక్తి స
మ్మదమొదవించుఁగాదె బుధమండల బంభరపంక్తికిన్ భవ
ద్విదిత సుపద్య పద్మతతి, విద్వదనీకవతంసమా! హృదిన్
గదలుచు త్వత్కవిత్వరచనా సుపచేళిమకున్ నమస్కృతుల్.

మందరాడ, — శిష్యపరమాణువు,
తే 15-12 1953 ది. — గెడ్డావు వేంకట సత్యనారాయణ.

క॥ శ్రీ మాడ్గుల వంశాంబుధి
సోమా! అష్టావధాన సురుచిరకవితో
ద్దామా! సత్కావ్యసుమా
రామా! సూర్యప్రసాదరాయ కవీంద్రా!

క॥ మించిన దీక్షామతి నేఁ
గాంచితిఁ జిత్తప్రబోధకావ్యము భవదీ
యాంచిత రచనా భవ్యము
ప్రాంచన్నయ నవ్య పార! పండిత తిలకా!

తే॥ జ్ఞాన సూర్యప్రసాదము మానసాంబు
జప్రమోదమై వెల్గు చిత్తప్రబోధ
కృతి నిరంతర మిద్ధాత్రి నెసఁగుగాత!
శతవధాన నిధాన! ప్రసాదరాయ!

శ్రీకాకుళము,
తే 12-10-1953 ది.

విద్వాన్,
చిలకా వేంకట కృష్ణదాసు.



ఉ॥ ఓయి ప్రసాదరాయ విబుధోత్తమ! విస్మయకృన్మనోహరా
మేయ మనీష యోగివరమృగ్య విశేషవినూత్న దివ్యభా
వాయతనంబు నై జహృదయాబ్జకళా ప్రతిబింబ రూపకం
బై యలరారు నీదు కృతి నారసినాఁడ ముదంబెలర్పఁగన్.

క॥ సత్యానందకరంబును
ప్రత్యయజనకం బఘఘ్నపదవరమహిత
ప్రత్యాహారము ఘనరుచి
యత్యాశ్రయ మిట్టి కవిత హారిరూపమెగా!

క॥ సమభావాన్వితమయ్యు న
సమభావాన్విత మపార జపవేద్యంబ
య్యు మహానందాజపవే
ద్యము తావక కవితఁగల రహస్యంబు సఖా!

కురుపాం,
తే 19-12-1953 ది.

నడిమింటి గుంపసోమశర్మ,
శ్రీ కురుపాం సంస్థానాస్థానకవి.

సీ॥ శాంతి దాంతిక్షమా సత్యశీలత గన్న
పట్టుశాలి కులాబ్ధి పార్వణశశి
తాతతండ్రులనుండి తార్కొన్న కవితా మ
తల్లి నారాధించు ధన్యతముడు
అష్టావధాన శతావధానములందు
ఖ్యాతి నార్జించిన ఘనమనీషి
పరిధిత భక్తి జ్ఞాన వైరాగ్య బోధక
గ్రంధ నిర్మాణ ధురంధరుండు

తే॥ మార్దులాన్వయ రత్నమై మహి వెలుంగు
సరస వేంకట సూర్య ప్రసాద రాయు
డనగ నాంధ్రావని బ్రసిద్ధి నందినట్టి
నీ మహిష్ఠ భాగ్యమ్ము వర్ణింప దరమె ?

క॥ చిత్తప్రబోధ కృతి స
చ్చిత్తములను జ్ఞానసుధను జిందించు మహో
దాత్త కవిత్వ పటుత్వో
న్మత్తించి రచించి తౌర ! యాంధ్రకవీంద్రా !

పొందూరు,
తే 10—1—1954 ది.

కవితాకోవిద,
అల్లంసెట్టి అప్పయ్య.

  

ఉ। ఆరయ మర్త్యవిత్తనమునందుఁదనర్చు తదీయమైన ధా
త్రీరుహ సూక్ష్మరూపము గతిన్ జెలువొందిన తత్త్వబోధవి
స్ఫారి కళాప్రశస్తిఁ గదుజానగు తావక చిత్తబోధ మిం
పారఁ బఠించి నమ్మదమునందితి; మార్దు ప్రసాద రాట్కవీ!

బంగారమ్మపేట.
తే 10—1—1954 ది.

వంగపండు లక్ష్మినాయుడు,
ప్రధానాంధ్ర పండితుఁడు, స్థానికోన్నత పాఠశాల సాలూరు.

క॥ మించిన వేడుకమై నేఁ
గాంచితిఁ జిత్రప్రబోధ కావ్యము, తత్ప్రో
దంచత్కవితామృతము హృ
దంచితరోగములఁ బాపుటబ్రిమె ? సుకవీ !

పొందూరు,
తే 10—1—1954 ది.

ఆచంటి సూర్యనారాయణమూర్తి,

  

మ॥ కవితాతత్త్వరహస్య వేదివయి ప్రఖ్యాతిన్ విరాజిల్లు నీ
ప్రవిలాసోల్లసితావధాన కవితా వైదగ్ధ్యము న్మెచ్చు స
త్కవులున్. తావక చిత్రబోధకృతి సాకల్యంబు వీక్షించి స
త్కవు లౌటబ్రిమె? దేశికోత్తమ! నమస్కారంబు నీ వాణికిన్

శ్రీ హరిపుర మగ్రహారము,
తే 3-1-1954 ది

శిష్యపరమాణువు,
బొత్స అప్పలస్వామి నాయుడు.

  

శా॥ శ్రీ మన్మాన్యగుల వంశవారిధి శరచ్ఛ్రీయుక్త జైవాతృకా !
నా మిత్రుండ! ప్రసాదరాయకవిచంద్రా! నీదు గ్రంథంబు నే
నా మూలాగ్రముఁ జూచితన్మయుఁడనై యానందముం బొందితిన్,
సామాన్యంబె భవత్కవిత్వరచనాసామర్థ్య మూహింపగన్

ఉ॥ ఒక్కొక పద్దియంబునకు నొక్కొక రత్నము చాలదయ్య! నీ
చక్కని కావ్యకన్యకను సత్కృతిసేయ నదెంత ధన్యుఁడో!
అక్కజమౌ! త్వదీయకృతి నందినభర్త, తదీయభూతికిన్
దిక్కగు నీ ఋణంబు నిలఁ దీర్పగఁ జాలఁడు కోటి యిచ్చినన్

పొందూరు,
తే 10—1—1954 ది.

చుక్క కృష్ణమూర్తి,
స్థానికోన్నత పాఠశాలోపాధ్యాయుడు.

చ॥ సురుచిర పూర్వవాఙ్మయపు సొంపులునింపులు నాకళించి, యే
యిరువది యేండ్లనుండియొ రచింతువు చిత్రవిచిత్ర కావ్యముల్
మఱియుఁగఁ బండితుల్ కవులు మెన్నజనించిన నీదు చిత్రజో
ధరచన కూర్పదే నవముదమ్ము మఱెంత; ప్రసాదరాట్కవీ!

వాడాడ, Via శ్రీకాకుళము. } బంకుపల్లి రామజోగారావు, తే 3-1-1954 ది.

  

ఉ॥ హత్తిన చిత్రబంధముల నన్నిఁటి నంతముఁ జేయు సద్గురూ
పాత్తమహిష్ఠధర్మవచనావళి నీదగు చిత్రబోధ మా
యత్త మొనర్చెఁ బాఠకులకౌర ! ప్రసాదకవీంద్ర! నీకవి
త్వాత్త సుధా రుచిప్రథిత తత్త్వమనీష నుతింపఁ జెల్లదే ?

బొంతలకోడూరు, Via శ్రీకాకుళము. తే 5-1-1954 ది. } విద్వాన్, ఆయుర్వేదాచార్య
వడగకాస్త్రభము
కవితానికేతన సభ్యుఁడు

  

ఉ॥ నీ కవితాకుమారిక వినిర్మలమానస, ఆమెకన్నులం
దే కద భూరిశీతలము తీయఁదనమ్మును మిక్కుటమ్ము, చీ
కాకుల నున్నవారల నఖండముదంబుధిఁ దేల్చునవ్వి; రా
కాకుముదాప్త సద్యశముఁ గాంచుము నీవు; ప్రసాదరాట్కవీ!

వాడాడ, Via శ్రీకాకుళము. } గోవిందు వేంకట నరసింహ శర్మ. తే 3-1-1954 ది

 

# శుద్ధి పత్రిక

| పుట | పంక్తి | తప్పు | ఒప్పు |
|---|---|---|---|
| 3 | 23 | జనయాధ | జనయూాధ |
| 10 | 21 | నూావుర మల | నూపుర మల |
| 14 | 16 | గుణవిధాన | గుణనిధాన |
| 15 | 20 | పరవిచారు | పరవిచారు |
| 20 | 22 | నజసృ సౌముఖ్య | నజసృము సౌఖ్య |
| 21 | 10 | నిద్యముల్ | నింద్యముల్ |
| 40 | 21 | యనఘుఁడు దురుగుణ | యనఘుఁ దూరుగుణ |
| 42 | 17 | కలివరుఁడు | కవివరుఁడు |
| 44 | 10 | నినాదవృవాద | నినాద సంవాద |

గమనిక :—

వ్యవధి చాలమి విడిచిపెట్టఁబడిన ముద్రి స్ఖాలిత్యములకు ద్వితీయ ముద్రిణమున నవరించఁబడును.

గ్రంధకర్త.

# శ్రీరాజరాజేశ్వరీ స్తవము

శ్లో॥ శ్రీబ్రహ్మాది సమస్త నిర్జర శిరః కోటీర కోటీమణీ
భానీరాజిత పాదపద్మయుగళీం సద్భక్తరక్షామణిమ్,
రాజద్రాజ సుధార సోల్బణ కళామాధుర్య సంభాషిణీం
వందే పూర్ణశశాంక సన్నిభముఖీం శ్రీరాజరాజేశ్వరీమ్.

# విఘ్నేశ్వర స్తవము

శ్లో॥ శ్రీమద్భక్త మనోంబుజాతతరణిం మాద్యద్గజేంద్రాననం
భూమీభృత్ప్రియపుత్రికాగ్రతనయం మాధుర్య సంభాషణమ్,
బ్రహ్మేంద్రాది సురార్చితాంఘ్రియుగళం విఘ్నాటవీపావకం
వందే సర్వవిపద్గిరీంద్రభిదురం మత్తాఖురాడ్వాహనమ్.

# సరస్వతీ స్తవము

శ్లో॥ యా దేవేంద్రసతీ ముఖాఖిల సురీ సంఘాత సంపూజితా
యా నీహార పటీర పారద శరద్రాకేందు శుభ్రాంగికా,
యా వాహీకృత జాలపాద్విహరణ వ్యాలోల కేళీరతా
యా పద్మోద్భవమానసాబ్జభసలా సా పాతు మాం శారదా.

సీ॥ తల్లియుఁ దండ్రియుఁ దగుగురుండును దేవుఁ
డును నీవ యని యుల్లమునఁ దలంచి
లలిత సత్కవితా విలాస సద్గోష్ఠి న
న్మజ్జీవితైక లక్ష్యముగఁ జేసి
మదిలోనఁ బరమాత్మ మానక భజియించి
నీ కృపామహిమ గణించి మించి
సద్గ్రంథరాజంబె సద్ధితుం డనియెంచి
బుద్ధిమంతులఁ జుట్టములుగఁ జూచి

యీ నికేము మెలంగుచుంటి నట్లగుట నీవు
సంతతంబును మన్మనోబ్జాతసీమ
నధివసించి మదీయ జిహ్వావిశుద్ధ
మండితాననాసీనవై యుండు మమ్మ !

## శ్రీ స ద్గు రు ధ్యా న ము

తే॥ శ్రీమహిత దివ్యవిజ్ఞాన సిద్ధి కల్మి
యోగసంరాధనరణి ననుత్తమంపు
గతిగ బ్రహ్మస్వరూపంబుగా వెలుంగు
సచ్చిదానందు సద్గురు సంస్తుతింతు.

తే॥ తత్పదార్థముఁ ద్వంపదార్థంబు నసి ప
దార్థమును దానయై యభేదార్థమగుచుఁ
దత్త్వమసి ముఖ్య లక్ష్యార్థతత్త్వమై స
దా వెలుఁగు గురుదేవు నాత్మను భజింతు.

తే॥ అణువులం దెల్ల నణువై మహత్తునందుఁ
దా మహత్తయి మూలతత్త్వంబు నగుచు
సచ్చిదానందమూర్తి ప్రశస్తి వెలుఁగు
సద్గురుబ్రహ్మ నాత్మలో సంస్తుతింతు.

## దేశికాభివందనము

శ్రీమంతున్ కొడుకొల్ల వంశజలరాశిప్రోత్థ జైవాతృకున్
ధీమద్వర్యుని వేంకటేశ సుకవిన్ దీవ్యద్యశున్ మద్గురున్
నీమం బొప్పు నెడంద తమ్మివిరిలో నిష్ఠా గరిష్ఠ ప్రతి
ష్ఠా మాన్య స్ఫుట భక్తియుక్తిని బ్రశంసల్ జేసి ప్రార్థించెదన్.

---

శ్రీరస్తు

# అవతారిక

—/o/—

శ్రీయువతీ లలామ మెదఁ
జెన్నుఁదనర్ప విరాజమాన శం
పాయుత నీరద స్ఫురణ
భాసిలి సంశ్రిత చాతకాళి కా
ప్యాయముఁగూర్చు విష్ణుఁడు శు
భస్థిర సత్కృప వెల్గ సత్యనా
రాయణ నామధేయుఁ గృతి
రాయు నజస్రముఁ బ్రోచుగావుతన్

సీ॥ ఏ తన్వి జనకుఁడు ఖ్యాతిఁ జెన్నొందు చిం
తామణీ ముఖ్య రత్నాకరుండు
యే భామ సోదరుం డీశ్వరు మౌళిపై
నింపు సొంపారు మవ్వంపుబువ్వ
యే ధన్య హృదయాధినాథుఁ డాశ్రితలోక
ఘోరసంసార విదారకుండు
యే రామ పుత్రకుం డీరేడు జగముల
సృష్టించి మించు విశిష్టమూర్తి

యే లలిత పాణి నిజభక్తపాళిఁ గరుణ
సర్వసంపద లిడి పేర్మి సాఁకుచుండు
నమ్మహాదేవి శ్రీదేవి యహరహంబుఁ
గృతిపతి నిశాంతసీమ వర్తించుగాత!

శా॥ శ్రీకైలాసగిరీంద్రసౌధమున గౌరీదేవితోఁ గూడి య
స్తోకానందముమై స్వభక్తజనసంతోషంబు సంధించు గౌ
రీకాంతాపరుఁ డోముగాత విततప్రేమానురాగాంచిత
శ్రీకారుణ్యరసాత్ముఁడై కృతిపతిన్ శ్రీ సత్యనారాయణున్

సీ॥ దక్షిణాస్థిత భర్తృతనుకాంతిసంతతుల్
సౌదామినీ జాల సరణి నెఱప
భాసురతరరత్నభాసిభూషణరోచు
లింద్రకార్ముకశోభ నింపునింప
సురుచిరమందహాసరుచిప్రతానక
మ్మైరమ్మదప్రభ నలవరింపఁ
గమనీయవరకళాకలితవీక్షణ పాళి
లలితబలాకాళి చెలువు వెలయ

మేనికాంతులు చీకట్లు నీనుచుండ
సగతనూజాతనీరద మతిరయమున
రిపుదవాగ్నులపొగరు హరించి మించి
మత్కృతి కుమారికానాథు మనుచుగాత !

చ॥ అతులితవేదనాదము లహర్నిశ మానన గహ్వరంబులం
బ్రతినినదంబులీన సురరాజ ముఖామరులెల్లఁ గొల్వఁగా
సితవనజాత పీఠిక వసించి జగత్ప్రతతిన్ సృజించు త
చ్ఛతధృతి మత్కృతీశ్వరుఁ బ్రశస్తచిరాయురుపేతుఁ జేయుతన్

మ॥ చతురోదార శతావధాన కవితాసంపత్తి సంధించి, పృ
థ్వీతలాధీశ సభాంగణస్థలములన్ విఖ్యాతి శోభిల్లఁ బం
డిత సత్కారము లందఁ జేసి, దయనవీక్షించు వాగ్దేవి, సం
తతమున్ మత్కృతి కన్యకాధవు వచోధామంబుఁ గావించుతన్

మ॥ చెలఁగుంజెల్వొఁడు సిద్ధిబుద్ధులను సన్త్రీరత్నయుగ్మంబు స
ల్లలితానంద కళావిరాజితగుణోల్లాసోజ్వలద్భావనం
కలితోదార మనీషమై గొలువ విఘ్నధ్వంసనఖ్యాతి భా
సిలుదేవుండు గణేశుఁ డోముతఁగృపన్ శ్రీసత్యనారాయణున్

సీ॥ ఏ పుణ్యతల్లి సమిద్ధపాతివ్రత్య
రమణీయగుణయైన రామమాంబ
ఏ ధన్యతండ్రి మహేశ్వరారాధనా
నయశీలి విజయబాలయమనీషి
ఏ మాన్య గృహిణీలలామ సద్గుణధామ
యై ఖ్యాతిఁగన్న సన్యాసమాంబ
ఏ గణ్య పుత్రిల మేనును సింహరా
యాభిఖ్యనెసఁగు నా యనుజుఁడొకఁడు

ఏ కవివరేణ్యుఁడెన్న సుశ్రీక మూర్ధ
వంశ దుగ్ధాబ్ధి పూర్ణ సుధాంశుమూర్తి
అతని మ త్పితృదేవు నుద్యద్యశస్కు
వీరభద్రి సీతారామ విభుఁ దలఁతు

క॥ అని యిష్టదేవతా వం
దనమును గురునుతి యొనర్చి ధరణి నొక కృతిన్
జనశుభదాయకమతి విర
చన మొనరుప నెంచియున్న సమయము నందున్

సీ॥ తనకీర్తి దశదిశాధవళాయతాక్షుల
హాళిపై విచికిలమాల గాఁగ
దన పరాక్రమము ధూర్తవిరోధి జనయూధ
ధాత్రీరుహకుఠారధార గాఁగ

దన ప్రవర్తనము సజ్జనలోకమున కెల్ల
నురుమోద మిచ్చు చేయూఁత గాఁగఁ
దన ప్రజ్ఞ సంస్కృతాంధ్ర కవిత్వతత్త్వవి
జ్ఞానైక భావప్రసారి గాఁగ

ధాత్రి వెలయు నాగేశ్వరగోత్రయుక్త
విమల మంతిని వంశాబ్ధికుముదహితుఁడు
పుణ్యవృషలాఖ్య వర్ణ రాడ్భూషణుండు
ప్రథిత సుగుణుండు సత్యనారాయణుండు

సీ॥ ఒక యోర సముదార సకలకళోత్తీర్ణ
పండితప్రముఖు లుపన్యసింప
నొక వంక నకళంక సుకవిలోకము తన
విజయాంక పద్యముల్ వేడ్కఁ జదువ
నొకచాయ వరగాయక కదంబ మంచిత
శ్రావ్యసంగీత ప్రశస్తి నెఱప
నొక చెంత స్మితకాంత వికసితాననపద్మ
లగుచు పుత్రిలు సేరి యనుసరింప

నొక యెడ స్వకీయసేవకప్రకర మొలసి
విశదభయభక్తియుక్తి సేవించుచుండఁ
జక్కదనముల కిక్కయౌ సౌధసీమ
ఘనతరాసనమున నుండి ఘనుఁడతండు

మ॥ ఘనకుంభోద్భవ గోత్రసంజనితుఁ బ్రఖ్యాతాంధ్రభాషారమా
వనజాక్షీచరణాంబుజాతకటకప్రస్ఫీతవజ్రోపలా
చ్ఛ నితాంత స్ఫుటకాంతి కాంత సుయశస్సాంద్రున్ విశేషజ్ఞబం
ధు నయస్ఫారపవిత్రహృద్వనజు నన్నుం గాంచి పల్కెం గృపన్

తే॥ కవితచే విభవమ్ముచే ఖ్యాతిఁగాంచి
మించు వంగడమందు జన్మించినావు,
గని మణియె కాక తోఁచునే కాచశకల
మరయ; సూర్యప్రసాదరాయకవిచంద్ర!

సీ॥ ఆంధ్రసంస్కృతభాష లందు సత్కావ్యముల్
పెక్కు రచించి పెంపెక్కినావు
జ్యోతిష వైద్య శాస్త్రము లాంధ్రమున వ్రాసి
విజ్ఞాన మూర్తివై వెలసినావు,
సకలపురాణప్రసంగ విశిష్టతత్త్వ
భావప్రదర్శివై పరఁగినావు,
అష్టావధాన శతావధానమ్ముల
నాచరించి యశంబు నందినావు

శంకర పదాబ్జయుగ్మపూజా మహత్త్వ
లబ్ధ కవితా విశేష విలాస మతుఁడ
వాప్తహితుఁడవు, మాద్గవాంశాబ్ధిచంద్ర!
ప్రథిత సుగుణ సాంద్ర! ప్రసాదరాట్కవీంద్ర!

చ॥ జయపురవల్లభుఁడు కవిచంద్రుఁడు విక్రమదేవవర్మయున్
నయమతి క్షత్త్రవంశజననాథుఁడు కృష్ణమనాయకేంద్రుడున్
సుయశుఁడు వాసిరాజకులశోభితరత్నము సీతరాముఁడున్
నయమున నిన్ను గౌరవ మొనర్చి తనర్చిరిగాదె? సత్కవీ!

ఉ॥ విద్యలకెల్ల నుత్తమపువిద్య కవిత్వము, దానిబ్రోచుటన్
హృద్యతరైక కీర్తి లభియించును, దాన సురేంద్రలోకవుం
బోద్యదుదార సౌఖ్యముల బొందగవచ్చు ననశ్వరస్థితిన్,
విద్య యొసంగరానిదియు విశ్వమునందొకఁడున్నె? సత్కవీ!

తే॥ క్షమయు దాతయు సద్గుణగ్రాహియు నగు
ప్రభువు సుకృతంబుకలిమి లబ్ధమగుఁ గాని
ప్రవిమలుఁడు సమర్థుండు విద్వాంసుఁడైన
కవి లభించుట భాగ్యమ్ము గాదె? మిత్ర!

ఉ॥ మానితసత్కవీంద్రగణమండన! ధారుణిలోన సత్ప్రసం
తానములందునుం గృతి ప్రధానము, విశ్రుతకీర్తిభాగ్యసం
ధానము, సుస్థిరం బగుట తథ్యము, గావున దానిమాకు సం
ధాన మొనర్పు మంచిత సుధామధువాగ్రచనావిశేషతన్

శా॥ అద్వైతోజ్జ్వల తత్త్వసారవిభవ వ్యావృత్తవిజ్ఞాన సం
పద్విఖ్యాతి నెసంగు సత్కృతి జగన్మాన్యప్రభావస్థితిన్
విద్వద్వర్యమనోనురంజన గుణస్ఫీతక్రియాయుక్తి యు
ష్మద్విద్యానిపుణాత్మ మేర్పడుగతిన్ సంధింపు; విద్వత్కవీ!

మ॥ అని కర్పూరవృతమ్ములంబును మహోద్యత్కాంతిమన్మౌక్తికా
ఘనహారంబు సుగంధిచందనము యోగ్యంబైన వస్త్రద్వయం
బును నర్పించి పవిత్రభావమున సంపూజించి సంతోషభా
వనరారాజదపాంగవీక్షణకళాభ్రాజిష్ణుఁడై యుండఁగన్

తే॥ తత్కృత సపర్యలంది యుద్యత్ప్రమోద
రసభరిత హృత్ప్రఫుల్లనీరజుఁడ నగుచు
నతనిఁ గన్గొని సద్భావ మతిశయిల్ల
హృద్యగరసద్యఫణితి నే నిట్టులంటి

శా॥ శ్రీమన్మంత్రిని వంశదుగ్ధజలధిన్ శీతాంశునింబోలె నెం
తే మాన్యస్థితి నుద్భవిల్లి జగతిన్ దీనార్థిచాంద్రీపతత్
స్తోమంబుం గరుణామృతాంశువుల సంతుష్టిం బ్రసాదించి యు
ద్దామోద్దీప్తయశుండవైతివి, సుఖీంద్రా! సత్యనారాయణా!

సీ॥ అనుభవించియు దీను ననుభవింపంగం జేయు
సువిశాలహృదయభాసురత గలిగి
పఠియించి యొరులచే పఠియింపంగాం జేసి
జనులను సవరించు శక్తి గలిగి
యాదరించియుం బరు లాదరింపంగ వన్నెం
గాంచెడుసుగుణవర్గంబు గలిగి
పూజించి సత్కవుల్ పూజింపంగా మెప్పు
వడయు భాషాదేవిభక్తి గలిగి

వరలు నెవ్వండు మంత్రిని వంశవార్ధి
విధుండు సత్యనారాయణవిభుండు సుగుణ
శుభుండు భాషాప్రపోషణప్రభుం డనంగం
బొగడువడు నిన్ను నెన్న మాబోంట్ల వశమె ?

శా॥ ఔదార్యంబున కాటపట్టు, వరవిద్యాశక్తికిం దోడు, స
మ్మోదం బిచ్చెడుకార్యదీక్షకు గృహంబున్, సద్గుణశ్రేణికిం
బా టౌచిత్యముతావు, ధైర్యమునకుం బ్రాకారమైయొప్పు కీ
ర్త్యాధారా ! భవదీయసచ్చరిత వర్ణ్యం బెందుంగాకుండునే ?

సీ॥ సతత యాతాయాత సత్పండిత కవిప్ర
సుందరం బెన్న నీ మందిరంబు
వినమిత శాత్రవ జనలోక దారిద్ర్య
భక్షణం బెన్న నీ వీక్షణంబు
సారహీర పటీర శారద నీరద
సన్మూర్తి యెన్న నీ చారుకీర్తి
అభ్యర్థినిచయ గృహాంగణస్థలరమా
నర్తనం బెన్న నీ వర్తనంబు

పార్వతీనాథపదయుగ ప్రణతిరతివి
శోభనీయ కవిత్వ తత్త్వాభిరతివి
పుణ్యతరకార్యవర్గ సమ్మోదగతివి
అమలగుణసఖ్య ! సత్యనారాయణాఖ్య !

తే॥ మించు సత్కీర్తి గడియించు మంచిబుద్ధి
నెలమి నీయందు సంధించె సృష్టికర్త
పూవున సుగంధము ఘటించు పొలుపువెలయ
నమలగుణసఖ్య ! సత్యనారాయణాఖ్య !

సీ॥ నీ నిర్మలేక్షణానీకమ్ము మధురభా
వప్రసన్నత్వదీప్తమ్ము సుమ్ము
నీ మనోహర వచోనియమమ్ము జనమాన్య
తమమైన సత్యబద్ధమ్ము సుమ్ము
నీ కోమలవు మనోనీరేజ మవ్యాజ
కరుణామరంద యుక్తమ్ము సుమ్ము
నీ సాధుతరకీర్తనీయప్రవర్తన
మరి జనతాభినంద్యమ్ము సుమ్ము

తే॥ నీ పవిత్రచరిత్రమ్ము నిఖిల సుజన
గణ వినుతి పాత్రమై కీర్తిఁ గాంచు కతన
ధన్యతమసంభవుండవై తనరినావు;
అమలగుణధుర్య ! సత్యనారాయణార్య !

తే॥ పండిత జనోపకార సద్భావ మొకటి
అమలకరుణాఢ్యమయిన నీ యాత్మయొకటి
మణివలనఁ గంకణంబు కంకణము వలన
మణిమెఱయునట్లు మెఱయు శుంభద్గుణాఢ్య !

ఉ॥ శ్రీమహిమాఢ్యవై భవ విశేషములన్ బుధలోకమాన్యవి
ద్యామహితప్రసిద్ధి సముదారమనీష నెనంగి సత్కవి
గ్రామణిపోషణంబును స్థిరంబుగ సేసి, కవిత్వసాహితీ
శ్రీమహిమంబుఁ గంటివి, ప్రసిద్ధము నీచరితంబు; ధీమణీ!

చ॥ వరగుణి! పూర్వభూపతులవై ఖరి సత్కవిసంస్తవార్హసు
స్థిరతరకీర్తివై భవవిశేషములన్ ఘనకావ్యరత్నమం
దిరములఁ బ్రీతిమై మెలఁగు నీవు సుహృన్మతిఁగావ్య మొందుసం
బరమునఁ గూర్చి యిమ్మనుట భాగ్యముగాదె? సుధీసుధాకరా!

క॥ కృతిదాన మిచ్చునతఁడును
గృతి దానముఁ గొన్నయతఁడు హృద్యస్థితి శా
శ్వతమగు యశస్సుఖంబుల
క్షితిఁగందురుసుమ్ము, సుకవిశేఖరవినుతా!

క॥ చిత్తపరిబోధ మను పే
రిత్తించి జనాళికెల్ల నాత్మజ్ఞానా
వృత్తి ఘటించుటలోఁ గడు
నుత్తమ మగు కృతి రచింతు, నురుగుణగణ్యా!

శా॥ కారుణ్యాంచితభావ! మత్కృతిసుతన్ గళ్యాణినద్దాని నిం
పాఱం బ్రేమపురాణిగాఁ గొని శుభవ్యాసంగలీలావహో
దారప్రజ్ఞ శివాంఘ్రిపద్మయుగళధ్యానైకపుణ్యక్రియం
జూఱం గొమ్ము సుఖస్థితుల్; విబుధరాట్చూడామణీ! ధీమణీ!

శా॥ వృద్ధుల్ మెచ్చెడు లీల నీకును లసద్విజ్ఞానయోగైక సం
బద్ధానందమనీషతో నుపనిషద్వాక్సారమై యొప్పు స
త్సిద్ధాంతంబులు బోధసేసి యసకృచ్చిద్యోగసౌఖ్యమ్ముఁదా
నిద్ధస్ఫూర్తి ఘటించుఁజుమ్ము, హిత! నాయీకావ్యకళ్యాణియున్

వ॥ క్షమ నీ కబ్బపురాణి బోధమయువాచారూఢిమన్నించి భక్తి మహేశాంఘ్రిసరోజయుగ్మము నెదం గీలించి విజ్ఞానభావము మై నొందు మఖండమైన శివజీనైక్యానుసంధాన సౌఖ్యము; శ్రీమంతినివఃశవారిధి శశాంకా! వత్యనారాయణా!

క॥ అని గౌరవయుత భావ
మ్మున విన్నపమాదరించి మోదమ్మున నా
తని యనుమతిఁగొని యిట్లు త
దనఘుతరకులావతార మభివర్ణింతున్.

## నాయకవంశాభివర్ణన

సీ॥ శ్రీమద్వసుంధరాభామిని జనలోక
రత్నకంధరహారరత్న మనఁగ
సర్వసర్వంసహా పక్షేందుసమముఖ
లలితాలికస్థల తిలక మనఁగ
ధాత్రీసరోజాతనేత్రా శిరోభాగ
భాగుదార సువర్ణపట్ట మనంగఁ
గుంభినీ శితిమేఘకుంతలా నాసికా
గ్రములంబమాన మౌక్తిక మనంగఁ
దనరుఁ జతురబ్ధిపరివృతవనధిమేఖ
లాతలాఖిలపురగణ రాజమనఁగ
భాసిత సితాబ్జగేహినీ పాదజలజ
ఝర్ఝనూపుర మల కురుపాముపురము.

తే॥ ఆ పురంబున సత్యధర్మానురక్తి
సజ్జనావన కుజన శిక్షా ప్రసక్తిఁ
బ్రథిత శివకేశవాభేద భక్తిఁగలిగి
లలితతరకీర్తి వెలయుఁ గాపుల కొలంబు

తే॥ ఆ కులమ్మున కెల్ల నాయక మనంగ
భవ్యతరపుణ్య సత్క్రియాప్రథితమగు ప
విత్రకీర్తి నాగేశ్వర గోత్రయుక్త
భాసమానైక మంత్రినివంశ మమరు

సీ॥ మంత్రినివారు నిరంతరంబును సత్య
ధర్మసద్గుణయుక్తిఁ దనరువారు
మంత్రినివారు రామాయణాదిపురాణ
సంశ్రవణాసక్తి జరగువారు
మంత్రినివారు సమ్యగ్బుద్ధి సుకవుల
శిష్టుల బుధులఁ బూజించువారు
మంత్రినివారు శుంభత్సర్వభాగ్యవై
భవకీర్తియుతులౌచుఁ బరఁగువారు

సచ్చిదానందుఁ డగు రామచంద్రు పాద
భక్తి గలవారు మంత్రినివార లనుచు
జగతి బుధజన సన్నుతి నెగడువారు,
వారి వర్ణింపఁ దరమె యెవ్వారికైన.

తే॥ అట్టి పావనవంశ మం దవతరించి
సర్వజనలోకలోచనోత్సవ మొనర్చి
సజ్జనావన దీనపోషణము సేసి
కడు యశముఁ గాంచె రామినాయుఁడు ధరిత్రి.

క॥ ఆతఁడు సద్గుణగణవి
ఖ్యాతుఁడు నీహార హీర హార దర యశో
జాతుఁడు కవి నుత చరిత
స్ఫీతుఁడు దా గౌరమాంబఁ బెండిలి యాడెన్.

కం॥ ధీరుఁడగు రామినాయుఁడు
గౌరమయందుఁగనె సకల కళ్యాణగుణో
దారాన్వితులన్ సుమతుల
నారాయణభక్తియుతుల నలువుర సుతులన్.

సీ॥ వితత ధర్మాధర్మ విజ్ఞాన విద్యావి
నయశీలుఁ డగు కూర్మనాయకుండు
చారుసౌందర్యవిస్ఫారాంగ జితపుష్ప
సాయకుండగు సోమనాయకుండు
సకలయాచక జన సదభీష్టనిచయప్ర
దాయకుండగు కృష్ణనాయకుండు
రమణీయకీర్తి విక్రమ దాన సద్గుణ
నయుఁడు జగన్నాధనాయకుండు
అను నలువురాత్మజుల మురహారి చతుర్భు
జములపోల్కి విరించ నాస్యముల జోక
రామినాయుఁడు సద్యశోధామకుండు
డెందమింపొంద గౌరమయందుఁ గనియె.

శా॥ అందున్ నాల్గవవాఁడు విష్ణుపదలగ్నాత్మాబ్జుఁడుద్యద్యశో
నందుం డంచితభావయుక్తుఁడు జగన్నాధాఖ్యుఁ డుర్వీజనా
నందప్రక్రియ నన్నమాంబనుమతిన్ సద్గణ్య జోగాంబికన్
అందం బొప్పఁగఁ బెండ్లియాడె స్వజనాహ్లాదానుసంధానుఁడై.

ఉ॥ ఆ యనఘుండు జోగసతియందునఁగాంచె జనైకవంద్యతే
జోయుతులన్ యశస్కుల విశుద్ధమనస్కుల సంతతావితా
మాయికులన్ మనోజ్ఞులఁ గుమారుల నిర్వుర ధన్యు సత్యనా
రాయణనాయకాగ్రణి, గుణాంచితశీలుని గుంపసామినిన్.

కం॥ అందగ్రియుఁడు విద్యా
సంసాత్మాంబుజుఁడు సత్యనారాయణుఁ డా
నందకధర పదవందన
సందీపితభావనుండు చర్చింపంగన్.

తే॥ ఆంధ్రసంస్కృతభాషా రహస్యవేది
నిఖిల సద్గుణసజ్జన నిచయ మోది
తతవిమల సాత్త్వికైక పదార్థఖాది
యౌర ! మంతిని సత్యనారాయణుండు

కం॥ సింహపరాక్రమవంతుఁడు
సింహప్రేక్షణుఁడు పురుషసింహుఁడు కవిరా
ట్సింహానతుఁడు మధ్యమజిత
సింహుం డతఁ డెన్న స్వకులసింహుఁడు జగతిన్.

కం॥ తనచేతి నున్న గంటం
బనవరతము నఖిలసజ్జనావనమును దు
ర్జనశిక్షణము నొనర్పఁగ
ఘనుఁ డాతం డెసఁగు ధర్మకలితమనీషన్.

కం॥ గోదాన కనకదాన ధ
రాదానాదుల నొనర్చి బ్రాహ్మణవరులన్
మోదితులఁ జేసి పుణ్యా
మోదమ్మును గన్న ధర్మమూర్తి యతఁడిలన్.

సీ॥ సత్యవాక్యప్రతిష్ఠానిష్ఠకుం దోడు
ధర్మభావ విశేషతత్త్వమొకటి
దీనార్థిమోదసంధానబుద్ధికిం దోడు
న్యాయార్జితార్థవిన్యాసమొకటి

సత్కవీంద్రవ్రజార్చామనీషకుఁ దోడు
దుష్టధిక్కారసంతుష్టి యొకటి
కడుబీదలం జేర్చు కరుణామతికిఁ దోడు
భాసుర సత్కీర్తి వాంఛయొకటి

తన పవిత్ర సాత్త్విక చరిత్రకు నశేష
మహిమ మలరింప వెలయు సమానుషప్ర
భావుఁడని బుధుల్ గొనియాడఁబరఁగె భళిర!
అంచితగుణుండు సత్యనారాయణుండు.

తే॥ శ్రీపతిని భూసతిని హరి చెందినట్టు
లక్కజెల్లెంద్రినయు ప్రేమ నలరునట్టి
అన్నపూర్ణమ్మ జగ్గమ యనెడు సతులఁ
బ్రీతిమెయి సత్యనాయఁడు పెండ్లియాడె.

ఆ॥వె॥ ఆతఁ డన్నపూర్ణమాంబిక యందున
బ్రీతిమీఱఁ గాంచెఁ గూతునొకతె
గంగమాభిధాన రంగన్నయువిధాన
ప్రణుత శుభవితానగుణవిధాన

ఆ॥వె॥ ధరణి జనులమెప్పుఁ దగఁ గాంచి వెలయు నా
తని ద్వితీయభార్య ధర్మధుర్య
సతుల మానికంబు జగ్గమ యవిరత
భర్తృపూజనప్రభాసభావ

క॥ న్యాయగుణరత్ననిధియగు
నా యమ్మ పకీరునాయకాభిఖ్యుఁ గుల
స్థాయద్దీపకు నొక సుతుఁ
దీయంబునఁ గాంచె బుధనుతిస్థితి మెఱయన్

చిత్తపరిబోధము

క॥ గంగాపార్వతులన్ శుభ
సంగతిమయిఁ గాంచునట్టి శంకరునట్లున్
రంగుగ నిరుపుర సతుల న
భంగప్రేమమెయి నితఁడు బాగుగఁ గాంచున్.

క॥ తనవంశమునందుఁ బుట్టిన
జనకులఁ దద్బంధుజనుల సన్మిత్రులఁ దా
ననిశము క్షేమంబు స్మితా
ననుఁడై ప్రశ్నించు సత్యనారాయణుఁడున్.

తే॥ సత్యనారాయణున కనుజన్ముఁడై ని
రంతరం బన్నమాట రవంతయేని
దాటి యెఱుఁగనియట్టి సద్వర్తనుండు,
సత్యపథగామియై గుంపసామి వెలయు.

తే॥ సుందరమ్మ కాంతమ్మ యన్ సుదతియుగముఁ
బరిణయించి ధర్మపరిభావయుక్తి
సంతతము స్వీయజనలోక సమ్మదార్థ
సరణి వర్తించు భళి! గుంపసామి ధరణి

ఆ॥ వె॥ ఈతఁడు సుందరమ్మ యందునఁ గనె జగ
న్నాధరాయుఁ గవిజనైకగేయుఁ
గుటపవిత్రు యోగ్యగుణవిశేషణపాత్రుఁ
బ్రకట పరవిచారు నొకకుమారు

క॥ జను లలర సత్యనారా
యణనాయుడు గుంపసామి యన్నయుఁ దమ్ముఁ
డును వర్తింతురు మఱి తమ
మనముల సౌభ్రాత్రగరిమ మల్లడిగొనఁగన్.

క॥ ఘన గుణుఁడు సత్యనారా
యణనాయుఁడు భవ్యయశము నార్జించుచు దా
ననిశమ్ము సత్యధర్మ
పరాయణమతిన్ వెలయు సుకవివర్ణితుఁడగుచున్.

సీ॥ శ్రీమించు శతధృతి జిహ్వపై భారతీ
తరుణీలలామ యెందాఁకనుండు
వనజాతలోచను వక్షంబుపై రమా
తామరసాక్షి యెందాఁకనుండు
నఖిలేశుఁడగు శివు నర్ధాంగమందు గౌ
రీకమలాక్షి యెందాఁక నుండు
శోభానిధానుఁడౌ సూర్యునిఁగోరి నా
ళీకినీకాంత యెందాఁకనుండు
తా సుధాంశుతో జ్యోత్స్న యెందాఁకనుండు
ధర జలధిలోన జలము లెందాఁక నుండు
నంతదాఁక ప్రశస్తమౌ యశముతోడ
నలరుగావుత సత్యనారాయణుండు.

—* షష్ఠ్యంతములు *—

క॥ ఏవంవిధగుణఖనికిన్
శ్రీ విశ్వేశ్వరపదాబ్జసేవాధనికిన్
భావమనోహర కవితా
శ్రీవిశ్రుత సుకవి నిచయ చింతామణికిన్.

క॥ శ్రీశివపదభక్తిరసా
వేశునకున్ సత్కళాప్రవేశునకు మహా
ప్రాశస్త్యబుద్ధినిహతదు
రాశునకు నల కురుపాంపురనివేశునకున్.

చిత్తప్రబోధము

క॥ శ్రీనిధి మంత్రిని వంశాం
భోనిధివరకార్తికీపరిపూర్ణేందునకున్
మానగుణానందునకున్
ధీనిష్ఠాపరిహృతప్రథితమందునకున్.

క॥ ధీరునకు జయంతసమా
కారునకు సుధీనిహృతవికారునకు మహో
దారునకు బ్రహ్మతత్త్వవి
చారునకుఁ బ్రశస్తగుణనిచయధారునకున్.

క॥ సాయునకు దానజితరా
ధేయునకు మనోజ్ఞనామధేయునకర్థి
ధ్యేయునకున్ సత్కార్యా
దాయునకు సమస్తకవిబుధవిధేయునకున్.

క॥ ప్రఘునీయ కళాంబుస్థా
న ఘటోద్భూతునకు సత్యనారాయణనా
మ ఘనఖ్యాతున కనిశని
రఘుభావన సంచయక్రియాప్రీతునకున్.

తే॥గీ॥ ప్రీతి నభ్యుదయ చయాభివృద్ధిగాఁగ
నేను గూర్చి సమర్పింపఁ బూనినట్టి
పుణ్యతమమైన చిత్తప్రబోధమనెడు
కృతికి నింకమీఁదఁ బ్రారంభమెట్టు లనిన.

—/o/—

శ్రీరస్తు

# చిత్తప్రబోధము

శ్రీ విజ్ఞాన సమిద్ధ యోగ సుపథశ్రేయోర్థ మాన్యస్థితిన్
దేవుం బోలె గురుం దలచి, మఱి తత్సేవావిధానాఢ్య స
ద్భావం బూని, తదీయబోధలను నిత్యంబెంచి, బ్రహ్మైక్యసౌ
ఖ్యావాప్త్యర్థము మానమంది, పరముం బ్రాపింపు మో చిత్తమా!

మ॥ ఘనసంసారపయోధియందు నిఁక సౌఖ్యం బెన్నఁగా నంతలే
దనిశం బీశ్వర పాదపద్మ భజన వ్యాపారముం జల్పి యీ
తనువున్ సార్థకముం బొనర్పఁ బరమాత్మంగూర్చి ధ్యానింపుమో
మనసా! దానను శ్రేయము మొందెదవు సుమ్మా! నీవు నిశ్శంకమై

ఉ॥ పుట్టిన దానికిన్ ఫలమువో భగవాను ననంతు నీశ్వరున్
గట్టిగ నాత్మలో నిలిపి కమ్రగతి న్నుతి సల్పుచుండుటల్,
పుట్టి ప్రవృద్ధిఁ జెంది చనిపోవు మృగంబునుబోలె నున్నచోఁ
బుట్టునె సార్థకత్వ? మిదిపోలఁగ నారసి చూడుమీ; చిత్తమా!

చ॥ పురుషులు భూతజాలమునఁ, బూరుషులందు ధరామరుల్, మహీ
సురతతి మంత్రవేదు, లిఁకఁ జూడఁగ వారలకంటె నన్నిఁటన్
వరులు ప్రబోధసంకలిత భావులు, గావున బోధయుక్తి సం
సరణవిరక్తి నూని స్థిరసౌఖ్యదు నీశు భజింపు; చిత్తమా!

మ॥ అరయన్ భ్రాంతుఁడు పుణ్యపాపయుతకర్మాలంబసంసారసా
గర సంజాత మహోర్మికాచయ సముద్ఘాతాహతాత్మాంగుఁడై
దరిఁ గానం డనునట్టి బోధమయసద్వాక్యంబు లాలించి సం
సరణాసక్తిఁ ద్యజించి చిత్తమ! శివున్ సర్వేశు ధ్యానింపుమా!

ఉ॥ సారములేని సంసరణ సాగరమందు మునింగి దుర్భ్రమన్
దారసు లోఁగి కామముఖదౌష్ట్యములన్ జెరలాడుచున్ మహో
దార పరాత్పర ప్రథిత తత్త్వ విచారణ మాని దుఃఖివై
యూరక యుంటమేలె? సత మోమనసా! శివు నాశ్రయింపుమా!

మ॥ ఘనమాధ్వీరసలిప్త తేజిత లసత్ఖడ్గంబు మండూకని
స్వనరాగంబు గవాస్యసింహము తృణప్రచ్ఛన్న కూపంబు నం
చును ధీమంతులు కాంతఁగూర్చి వచియింతుర్గాదె? తత్సౌఖ్యచిం
తనమున్ దూరముసల్పి నిత్యము శివున్ధ్యానింపుమో చిత్తమా

చ॥ పతిహిత మాత్మఁగోరి జనవర్గము మెచ్చెడునట్టి ధర్మపు
న్మతిమెయి భర్తృసేవలు సమంచితలీలఁ బొనర్చు సాధ్వి సం
సృతి జలధిప్లవం బదియె చిక్కినమే లటు చిక్కకున్న నం
తత పరమాత్మయోగమున ధన్యతఁ బొందుము నీవు; చిత్తమా

ఉ॥ ఏటికి సౌధజాల? మది యేటికి దారసుతాప్తబంధు? లిం
కేటికి నైహికేచ్ఛ? సిరులేటికి సంసృతిబంధవాంఛలున్?
కాటికి నేఁగువేళ నవి కానవ కిట్టివి చెల్లవయ్యె! నీ
కేటికి వట్టిభ్రాంతి? జగదీశ్వరుని న్భజియింపు; చిత్తమా!

ఉ॥ దారుణబంధహేతు ధన దారకుమార దురీషణత్రయీ
ధారణమాని, సజ్జనుఁడు, తత్త్వవివేకము నూనియోగసం
చారణబుద్ధి మోక్షపథసంగతిఁ బూని సుఖించుఁగాన, అ
ద్దారిని నీవుపోయి పరతత్త్వము నద్ధి భజింపు; చిత్తమా!

తే॥ అకట! జనన జరా మృత్యు వికటనక్ర
సహిత కాలాబ్ధి మగ్నమీ జగ మటంచు
నెఱిఁగి, ధర్మప్రవృత్తిమై నెల్లవిడిచి
పరశివుని గొల్వు మిఁక నిరంతరము మనస!

తే॥ జగము విషయంబులెల్ల నశ్వరము లనుచు
బ్రహ్మనిష్ఠాన భూతి శాశ్వత మటంచు
స్థిరమతిఁ దలంచి, మాయఁ ద్యజించిమించి.
పరఁగ సత్యంబును భజించి, బ్రదుకు మనస!

క॥ మమకారంబు నహంకా
రము సంసారానుబంధరజ్జువులు సుమీ!
యమ నియమాదిక శితదా
త్రెమ్మఁజేకొని చిత్తమా! విచారింపు మొగిన్

మ॥ తలిదండ్రుల్ మఱి యాలుబిడ్డలును భ్రాతల్ మిత్రు లీసంసృతిం
బలువేళ్ళందిని బొందియుంటి విఁక నెవ్వారి న్మదింగోరి యు
మ్మలికం జెందె దనిత్యమం చెఱిఁగి శంభద్భక్తి సర్వేశుప
న్నలినద్వంద్వము నాశ్రయించి యతనిన్ ధ్యానింపుమో చిత్తమా

ఉ॥ కర్మముచే జనించు మఱికర్మముచే నభివృద్ధిఁగాంచుఁ దా
గర్మముచే నడంగును జగంబునఁజూడ సమస్తజంతువుల్,
కర్మము మానవావళికి గాదిలిదైవము, గాన, నీవు న
త్కర్మము నూని యీశు నవికారుఁబరున్భజియింపు; చిత్తమా!

చ॥ ఎలమిని వృద్ధిఁజెందు మఱిహీనతకై, కడుఁజేరియుండుఁ బాఁ
గలయిక లేకపోవుటకుఁ, గారణయోగముచే జనించెడుం
బొలియుటకై, సుఖంబులను బొందును దుఃఖములొంద, నెందునుం
దలఁపఁ బదార్థముల్ విను; యథావిధి నీశుభజింపు; చిత్తమా!

చ॥ తరువులఁ బూలుఁబండ్లు సముదారతఁ దోఁచును గాలయుక్తి న
ల్లరవుగఁ గర్మయుక్తి జనియించు నజస్ర సౌముఖ్యదుఃఖముల్,
కరము పురాకృతోద్భవ వికారములం గలఁగుండు జెంద కీ
శ్వరు భజియించి యోగపథసంగతి సంతసమొందు; చిత్తమా!

చ॥ నిజముగ సౌఖ్యదుఃఖము లనిత్యములే కద ! వానిసంగతిం
బ్రజనితమౌను మోదమును బంధురశోకము; గాన యీశ్వరున్
భజనమొనర్చి శాంతియుతభావముతోడ, వికారసంతతిం
ద్యజనము సేయఁగోరి తనుఁ దాఁ గను యోగముఁ బూను; చిత్తమా

ఉ॥ వింతగ సర్వలోకములు విష్ణునిబాజ్ఞ నెసంగునట్టు ల
త్యంత మహింసయందు మఱి యంచిత ధర్మములెల్లనుండు ని
ట్లెంత యెఱింగి భూతదయ యెంతయుఁ బూని పురాణుదేవు నా
ద్యంతవిహీను నీశ్వరు నహర్నిశము న్భజియింపు; చిత్తమా !

మ॥ పరిహాసంబు నిరీక్షణంబు మఱి సంభాషావిధానంబు సుం
దరి యందుం గడు నిద్యముల్ సుమీ! తదుద్యచ్చారుసౌందర్యవి
స్ఫురితాంగం బది యస్థిమాంసమయమంచున్ సద్వివేకంబునం
బరిశీలించి విరక్తిఁజెంది శివుఁన్ భావింపుమో చిత్తమా !

తే॥ శుక్లమునకు మసం బెన్న సూక్ష్మరూప
మల్లగుట నూర్ధ్వరేతస్కుఁ డైనవాఁడు
గాంచుఁ జిద్రూపు నాత్మ యోగంపుసరణిఁ,
దత్త్వధనిరూఢిఁ బొమ్ము; చిత్తంబ! నీవు

క॥ ధరణిఁ బవిత్రపుబ్రదుకున
నరయ ననూనంబు నక్షయంబు నపారం
బురుతరము నగు సుఖమొదవుఁ,
బరు నీశ్వరుఁ దలఁపు మట్టిపథమున మనసా !

చ॥ అరయ సమస్తభోగముల నంచితరీతిఁ ద్యజించి దేవమా
సరతరుమూల వాసివయి, నిరుపమవిరక్తి యొసంగఁగా వసుం
ధర మృదుశయ్యఁగాఁ గొని, ఘనంబుగ గోఁచినిఁ బూని, ఘోరసం
సరణవిమోక్షణార్థము ప్రశాంతు నంతున భజింపు; చిత్తమా !

చ॥ ఎలమిని గామభోగముల నెల్లఁ ద్యజింప లభించు సౌఖ్యముం
దలఁపుము, జీర్ణపర్ణఫలతండము నీళ్లను గాలి మెక్కి మా
నులు పరమాత్ముఁ గొల్చెదర నూనత, వారలు వెఱ్ఱివారె? నీ
చలనపుబుద్ధిమాని స్థిరసౌఖ్యదు నీశు భజింపు; చిత్తమా!

ఉ॥ యోగము నింద్రియప్రజయ హానిస్థితి మాన్పుతపంబునుం బరి
త్యాగగుణంబుఁ గల్గిన మహాత్ములు, రాగముఁ బోలు దుఃఖముం
ద్యాగముఁబోలు సౌఖ్యమును నారయ లేదన నాలకింపవే?
త్యాగపుబుద్ధితోడఁ బరమాత్ము భజించి తరింపు; చిత్తమా!

చ॥ అరయ ననేకరీతుల సమంచితవైఖరి విస్తరిల్లు వి
స్ఫురణపుధర్మవర్గమునఁ బోల్ప నొకందును నిష్ఫలత్వముం
బొరయదు, మోక్షవాంఛ మెయిఁ బూనిన ధర్మము శ్రేష్ఠమండ్రు
తత్సరణి మెలంగి బ్రహ్మపద సంగతిఁ జెంది సుఖింపు! చిత్తమా

చ॥ అరయ సమస్తబంధనము లందును ముఖ్యము కామమే సుమీ!
పరఁగఁ దదీయవర్జనపుభావము పెంపుగఁ జేసి యాత్మ తా
శరద చయంబు వాయఁ గడు సారున వెల్గెడు పూర్ణచంద్రుని
ట్లురవగుఁ గాన దీని మది నూని చరింపుము నీవు; చిత్తమా!

చ॥ భయమొసఁగూర్చు దుర్విషయవర్గము నేర్పున నిగ్రహించి తా
నయమహితంపుజ్ఞానపథమందు మెలంగుట నాత్మశక్తి యెం
తయు నభివృద్ధినొందు, మఱి దానిని బొందినఁ బొందరాని సి
ద్ధియుఁ గనరాదు, దానిఁగని దేవు ననంతు భజింపు; చిత్తమా

చ॥ ఘనతరదీక్ష బుద్ధిఁ గొని, కామ్యములాడ మనంబు నిల్పి, యు
మ్మనమున నింద్రియంబుల సమంచితయోగనిరోధినాఁగి, దుః
ఖనికరమైన దుర్విషయకాండముఁ ద్రోచి, సుఖంబు నిచ్చు బో
ధనయుత తత్త్వయోగపుఁబథంబున నీవు మెలంగు; చిత్తమా!

చ॥ ఘనులగు సాధుసత్తములఁ గాంచుటఁ బుణ్యమొసంగు, వారిస్ప
ర్శను నఘనాశనంబగుఁ, బ్రశస్తతరీయపుగోష్ఠియు న్విర
క్తిని ఘటియించు, సేవనము దివ్యసుమోక్షపదంబుఁ గూర్చుఁ, గా
వున నటువంటివారియెడ బుద్ధిని ద్రిప్పి మెలంగు; చిత్తమా !

చ॥ అమలము నిత్యమవ్యయమునై తగు మోక్షపదంబులబ్ధికిన్
క్షమయు దమంబు సత్యమును జక్కని నిశ్చయంబుఁ గ్రమ, సాధనసం
గమమునఁ జేసి తత్సుగుణకాండము గల్గును, గాన, సజ్జన
ప్రముఖులసంగతిన్ సతమువర్తిలి దేవుభజింపు; చిత్తమా !

ఉ॥ స్వానుభవప్రసిద్ధిఁ గొనబారిన బ్రహ్మపదార్థబోధమున్
మానితలీల వెల్గెడు శమంబు నిరెండును మోక్షభాగ్యసం
ధాన మొనర్పఁ జాలునని తత్త్వవిదుల్ పచియింత్రు; గాన స
ద్ధ్యానిని గోరి యీశ్వరు శుభప్రదు నాత్మ భజింపు; చిత్తమా

చ॥ మనమును వాక్కు నెవ్వఁడసమానదృఢంబగు బుద్ధి రక్షచేఁ
బనుపడఁజేయు నాతఁడె శుభప్రదబోధ తపంబుఁ ద్యాగముం
దన యఱచేతిలోనఁ గల ధన్యుఁడటంచు వచింత్రు పెద్దలే
యనుభవసిద్ధవాక్యముల నాని మెలంగుము; నీవు చిత్తమా !

చ॥ రుజలుడుపంగ నెంచి కడు రూఢిగ రోగి భిషక్ప్రవర్యు భే
షజమునకై ప్రవర్తిలెడు చందమునన్ గురుదేవుసేవచే
నిజమును శౌచమున్ శమము నిర్మలశాంతి వహించి, మోహముం
ద్యజన మొనర్పఁగోరి తనుఁ దాఁ గను యోగముఁ బూను; చిత్తమా

శా॥ ప్రాణంబుల్ మెయి నుండునంతకు మనోవాక్కాయకర్మంబులన్
జ్ఞానవ్యాప్తత తత్త్వబోధన రహస్యస్ఫార సద్గ్రంథసం
తానంబున్ గురుదేవు నీశ్వరు సముద్యద్బుద్ధిఁ గొండాడి, బ్ర
హ్మానందప్రదయోగభాగ్యమృతసౌఖ్యం బొందుమో చిత్తమా!

చ॥ అరయ విరక్తి కంటె మఱి యుంచిత భాగ్యము లేదు, ఘోరసం
సరణము కంటె లోకమున శత్రువు లేదు, సుబోధకంటె సు
స్థిరుఁడు హితుండు లేఁడు, గురుదేవుని కంటెను దాత లేఁడటం
చురుతరబుద్ధి నమ్మి, శివు నుత్తము దేవు భజింపు; చిత్తమా !

చ॥ ఉరుతరతత్త్వచింతనమె యుత్తమమార్గము, శాస్త్రచింతనం
బరయఁగ మధ్యమంబు, మఱియుంతకుఁ దక్కువ మంత్రచింతయో
గ్యరహిత తీర్థచింత యధమాధమమందురు వివేకు లిట్టు లీ
సరణి యెఱింగి యోగపథసంగతిఁ దత్త్వముఁ బొందు; చిత్తమా

చ॥ జలమయతీర్థముల్ మఱియు సానుమృగాత్మక చిత్రి[illegible]నముల్
చెలువుగ స్వీయసంస్కృతి విశేషప్రబంధము లెల్లఁ ద్రెంచి ని
శ్చల మగు మోక్షమిచ్చునని సద్వ్రతుఁ డెవ్వఁడుఁ జెప్పఁ డ[illegible] సి
చలనప్రబుద్ధి మాని శుభసంయుతు నాత్మ భజింపు; చిత్తమా !

చ॥ అతి భవబంధ దుఃఖపరులై తగు నజ్ఞుల భావనార్థ మీ
ప్రతిమలు కల్పనం బొనరుపం బడియెం గద యంచు యోగి త
ద్గతి విడనాడి యాత్మ నవికారు శివుం గనుఁ గాన, నీవు స
మ్మతి నటువంటి మార్గమున మానితు నీశు భజింపు; చిత్తమా

ఉ॥ సార విహీన సంసరణ సంగత చింతఁ ద్యజించి, తత్త్వవి
స్ఫార విచారణంబున శుభప్రదయోగ పథావలంబనో
దార పవిత్ర వస్తుపద దర్శనభాగ్య సమర్థ యోగ్యవి
స్ఫారతఁ బూని బ్రహ్మము ననంగము నంది సుఖింపు; చిత్తమా!

తే॥ సాధన చతుష్టయం బభ్యసం బొనర్చి
గురుపదాబ్జాతములఁ గొల్చి గుఱుతు నెఱిఁగి
బంధములఁ ద్రెంచి నిరతంబు బ్రహ్మయోగ
విశ్రుతసుఖంబు నొందుమో వెఱ్ఱిమనస !

మ॥ మమతాహంకృతులం ద్యజించి మతి సమ్యక్సత్త్వనిష్ఠ స్థిరో
ద్భ్రమణం బూడ్చి నిరంతరంబును బరబ్రహ్మైక్యసంధాన యో
గమహారూఢపదావలంబ మగు విజ్ఞానంబునుం బూని ని
త్యమహత్తత్త్వ సుఖామృతాస్వాదన భాగ్యం బొందుమా చిత్తమా

మ॥ సమదృష్టిప్రతిభాఢ్యులైన విబుధుల్ సచ్ఛాస్త్ర జన్యంబు జ్ఞా
నము నెంతేనిఁ బరోక్షమందు రిఁకఁ బ్రాంచత్స్వానుభూతిప్రయు
క్తమతిన్ సంభవమైన జ్ఞాన మపరోక్షం బందు, రింకన్ ద్వ
యమునుం జెంది మనంబ! సత్యమగు నిత్యానందముం బొందుమా

తే॥ చెలఁగియుండు గర్భితమయి జీవియందు
యోగ్యదివ్యతత్త్వం బది యోగపరణి
లభ్య మగు నన్యగతుల ఫలంబు లేదు,
దానఁ బొనుపుము బుద్ధిఁ, జిత్తంబ! నీవు.

క॥ బహిరంతఃప్రకృతి విని
గ్రహించి లోశక్తిఁ బైకిఁ గన్పఱచెడు నా
రహి దివ్యతత్త్వ మొదవును;
మహత్త్వ మిది యోగ్యమైన మార్గము, మనసా!

క॥ రథము శరీరం బాత్మయె
రథికుఁడు, మన మెన్న నశ్వరాజము, మతి సా
రథి యని చిత్తము! తలఁచి సు
పథమునఁ బరిపూర్ణసిద్ధి వడయుము నిష్ఠన్.

శా॥ చింత ల్వీడి నిరంతరంబు సుఖసంసిద్ధి స్వలంగొంచఁగా,
నంతర్భాసిత దివ్యతత్త్వమును దావ్యక్తం బొనర్పంగ, న
త్యంతాసక్తిని గర్మ యోగ మహితోద్యద్జ్ఞాన మార్గత్రయిన్
సంతోషంబున నంచరింపు మిదియే సన్మార్గముల్; చిత్తమా!

మ॥ అలుకం గాంచియుఁ గొట్టఁగా నడుగఁగా నైనం దొడంగండు, క
న్నులకు న్మందటఁ బైఁడిప్రోక యదియుండుంగాక తాఁ బుచ్చికోఁ
డెలమిన్ మేలగునిట్టి నిష్ఠ మెయి, సర్వేశుం గరద్వంద్వ మూఁ
దలఁ గీలించి భజించు సజ్జనుఁడు; తన్మార్గంబున న్నీవు ని
ర్మలసద్బోధముఁ గోరి దేవుఁ బరమాత్మన్ మ్రొక్కు మో చిత్తమా

ఆ॥వె॥ ఎట్టి కాంతనైన నెవుడు రమింపక
ఋతువు నెఱిగి స్వీయగృహిణియంద
వ్రతము కలిమి మెలఁగి వర్తించుచును నీవు
శివు ననంతుఁ బరు భజింపు; మనస!

మ॥ తనుసంబంధపుయాత్రకై యశనకృత్యం బర్థిమైఁ దీర్చి, దా
నిని బూర్ణం బగురీతిఁ గైకొనక, యెందే దుర్విలోలత్వబు
ద్ధిని నప్రాప్తముఁ గోరబోక, శుభవృత్తిన్ బూజనుం బ్రోచి స
జ్జనభావంబునఁ దత్పురాణపురుషున్ ధ్యానింపు మో చిత్తమా!

చ॥ పరుషపుమాటలాడక, వివాదము సేయక, దూషణంబులన్
నెగపక, సత్యయుక్తమగు నీతిఁ ద్యజింపక, ధర్మసంగతిన్
నిరతము సద్వచోనియమనిష్ఠ వహించి, పరేశుఁ గూర్చి సం
సరణమహాబ్ధితారణ విచారణమై భజియింపు; చిత్తమా!

తే॥ సకలభూతంబు లందుఁ బ్రశస్తలీల
నతినిగూఢత వెల్గు బ్రహ్మంబు, దాని
సూక్ష్మదర్శులు దర్శింతుర్ సూక్ష్మబుద్ధి;
నట్టి బుద్ధిఁ గన్గొనుము, నీయాత్మ; మనస!

శా॥ శ్రీమద్బ్రహ్మజగద్విమర్శన లసచ్చింతా విహీనుండు దాఁ
గామక్రోధవిలోభ మోహయుత దుర్గర్వాత్ముఁడై సంసృతి
వ్యామోహాంబున సంచరించు; నిది నీ వాలించి, సత్యార్థవి
ద్యామోదాంచిత యోగమార్గమున సౌఖ్యం బొందుమో చిత్తమా

మ॥ సరసీజాతదళాంబు బిందునిభ చాంచల్యంబు జీవంబు, దు
స్తరసంసారపయోధి మగ్నజను లజ్ఞానంబునం జూడ నే
రరిక న్మందుఁగఁ బొందు దుర్గతిఁ; బరబ్రహ్మైక్యసంధానయో
గరతిం బూని యనిత్యము న్విడిచి సౌఖ్యం బొందుమో చిత్తమా!

మ॥ సతి తా నెవ్వతె? పుత్రుఁ డెవ్వఁడు? డిఁక నీ సంసారబంధంబు చి
త్రితమం బెట్లు ఘటిల్లె? నీ వెవఁడ? వెద్దారిం బ్రవేశించినా?
వతిసూక్ష్మార్థము లివ్వి నీ వెఱిఁగి, దుర్వార్యమోహము న్విడి, శా
శ్వత విజ్ఞాన సుయోగమార్గమునఁ దత్త్వంబొందు మో చిత్తమా

చ॥ అరయఁగ బాల్య మాటలను, యౌవన మంగనలందుఁ బిమ్మటన్
జర పొదువంగ సంసృతి విచారమునం గడు భ్రాంతియుక్తుఁడై
పురుషుఁడు సంచరించు; నటు పోవక నీ విఁక బ్రహ్మచింతనా
పరమగు యోగమూని భవబంధముఁ ద్రెంపి సుఖింపు; చిత్తమా

మ ధన మార్జించుచు నున్నయంతవఱకున్ దారాత్మజాతాది బం
ధు నికాయం బనురక్తిఁ జూపు; మఱి వృద్ధుండైన నిర్భాగ్యునిం
గని జీవచ్ఛవ మంచు నెవ్వరును బ్రశ్నం జేయ రీక్షింప రి
ట్టి నికృష్టంబగు వృత్తిపీడి పరమేష్ఠిం గొల్వుమో చిత్తమా!

చ॥ వినుము, ధనార్జనంపుఁ దృష వీడి, సుబుద్ధి వితృష్ణ నూను; మ
త్యనుపమ పూర్వకర్మ సముపాత్తధనంబు గ్రహించి మానసం
బునఁ బరితోష మొందుచుఁ బ్రబుద్ధవినిర్మల భక్తిమై నిరం
జనుఁ బరమాత్ము నవ్యయుఁ బ్రశాంతమతి న్భజియింపు; చిత్తమా

చ॥ అరయ మశాశ్వతంబయిన యర్థ మనర్థమటంచు, దాన బం
ధురమగు సౌఖ్యమించుకయుఁ దోఁపదు, కావున దానిపీడి సు
స్థిర పరతత్త్వయోగమున దివ్య మహత్తర నిత్యసౌఖ్యము
ద్ధురగతిఁ బొంద, దేవు శుభదుం బరునీశు భజింపు; చిత్తమా!

మ: ధనకాంతాదులయందు నల్లుకొను చింతావల్లి వైరాగ్యభా
వనిశాతాంచదుదారదాత్రమున శృంఖలీల ఖండించి, స
జ్జన గోష్ఠీష్వసంగతిన్ భవసముద్రం బర్ధిమై దాఁటి, త
త్త్వనిసర్గంబగు సౌఖ్యమొందఁ బరునిన్ భావింపు మోచిత్తమా

ఉ: దానము లెన్ని యిచ్చిన, వ్రతంబుల నెన్ని యొనర్చినన్, నదీ
స్నానము లెన్ని చేసినఁ, బ్రశస్తతరంబగు తత్త్వయోగసం
ధాన మెఱుంగకున్న యెడఁ దా భవమందు మునుంగు దేహి; యి
ద్దాని నెఱింగి నీవు పరతత్త్వము నర్థి భజింపు; చిత్తమా !

ఉ: పుట్టియుఁ జచ్చియున్ మఱలఁ బుట్టక తప్పదు, దుస్తరంబు నై
నట్టి భవాబ్ధి దాఁటఁగ సమర్థుఁడె యూ మతిమెట్టివాఁడు; నీ
యిట్టి మహాంబురాశిఁ దరియింపఁగ బ్రహ్మపదైక్యసౌఖ్య సం
ఘట్టన యోగనిష్ఠ నవికారు శివున్ భజియింపు; చిత్తమా !

చ: వినుము జగంబు సర్వమును విష్ణుమయంబని యెంచి, నీవు నే
ననియెడి భేదభావము రవంతయు లేక ప్రశాంతబుద్ధివై
ఘనతర యోగమార్గమునఁ గారణకారణు నాత్మమూలు న
త్యనుపమ తేజు నీశ్వరు నహర్నిశము న్భజియింపు; చిత్తమా !

మ: అరిషడ్వర్గ సమాశ్రయంబు సకలాపాయంబులం గూర్చు, దు
స్తరసంసారపయోనిధిం గడచి మోక్షం బంద నూహించు ధీ
వరుఁ డియ్యాఱిటిఁ బాయఁగావలయు, నీ భావంబు గుర్తించి త
త్పరమాత్మున్ భజియింపు వెఱ్ఱిమనసా! బ్రహ్మైక్యసంధానతన్

ఉ: భారము పేరిమిం బ్లవము వార్ధిఁ దరింపఁగ లేనిభంగి దు
ర్వారమనోభవప్రథితశక్తిఁ జరించెడి జీవుఁడెన్న సం
సార మహాబ్ధి దాఁటఁగ నశక్తుఁ డటందురు పెద్ద, లీ వచ
స్సారము గుర్తెఱింగి శుభసంగతు నీశు భజింపు; చిత్తమా !

ఉ॥ ఆరయ మే లసంగము, సమంచితబోధనమే సుమీ మహో
దార శుభప్రసిద్ధగతి, తాపసవృత్తియె యోగ్యకృత్య మీ
తీరున గురుశ్రేణిం గి జగదీశు భజించుట వేదవాక్యత
త్త్వోరు మనోజ్ఞబోధ మదినూనుట సుమ్మిదినమ్మ; చిత్తమా !

ఉ॥ జ్ఞానమె దృష్టి మానిసికిఁ, గావున నేత్రవిహీనువగ్గ వ
ధ్యానము లల్ల సుమ్మ పరతత్త్వవివేక విహీన వృత్తు, లి
ద్ధానిఁ గెఱింగి వేగమ యుదారసుఖాస్పదమైన తత్త్వవి
జ్ఞానముఁ గోరి యీశ్వరు నజస్రము భక్తి భజింపు; చిత్తమా !

మ॥ భవదుఃఖకవినాశకారణ మహాప్రజ్ఞాధి రూఢుండు దు
ర్భవ విక్లేశ నిమగ్నచిత్తుల ధరాధిస్థాన ముందున్న వాఁ
డవని స్వర్తులువారిఁ జూచునటు లొయ్యం జూచుఁగాఁబట్టి యా
త్మవివేకంబున జ్ఞానమొందు మిఁక నుద్యద్దీక్షమైఁ జిత్తమా !

చ॥ కనుఁగొన 'బ్రహ్మసత్యము, జగంబిది మిథ్య' యటంచు వేత్తలీ
యనృతజగత్ప్రసక్తి విడనాడి బుధిస్థితివెల్గు యోగసం
జనిత సుఖామృతాస్వదన సౌఖ్యవశస్థితిఁ బొంద శుద్ధబో
ధనయుత యోగమార్గమున ధన్యతఁ గాంచుము, నీవు; చిత్తమా

చ॥ కలనొకరుండు వ్యాఘ్రమును గన్గొని నిద్దురలేచి చూచుచోఁ
గలయును వ్యాఘ్రముం దలఁపఁగల్గనిఁ దోఁచు విధంబెసూ జగ
ద్విలసనమంచు బ్రహ్మపదవేత్తలు వల్కుదు రట్టిలోకసం
కలితపు దృశ్యము న్విడిచి, కాంచుము బ్రహ్మము నాత్మఁ; జిత్తమా

క॥ 'యా - మా - సా - మాయా' యని
ఆ మాయను దామసీగుణాత్మిక యని స
ద్ధీమహితులు వాక్రుచ్చెద
రీ మాటల నమ్మి పరు భజింపుము; మనసా !

చ॥ కర మలరారు సత్త్వము సుఖప్రదమై, బహుఘోరదుఃఖ బం
ధురము రజస్సు, మందగుణతుందిలమెన్నఁ దమస్సు, గాన ను
ద్ధురగత సమత్వమూఁది యిటుతోఁచు నవస్థలఁ జిక్కకుండు మే
యరయఁగ మాయపోక; యిది యాత్మలగించి చరింపు; చిత్తమా!

మ॥ వినుమీ కేవల సత్త్వయోగమును ఠీవిం బూని వర్తింపఁ గ్రొ
న్నన నీరాజసతామసంబులను దా నాశంబుఁగావించి త
త్త్వ నిగూఢార్థ వివేక భావన మహాభాగ్యంబు సంధించుఁ గా
వునఁ దన్మార్గము నంటియుండు మిఁక నద్బోధార్థివై; చిత్తమా!

తే॥ కేవలాద్వయానంద సంభావనీయ
తత్త్వ మర్థించి యెల్లబంధముల నెడసి
స్వస్వరూపైక్యసంధాన సరణి యందు
శ్రీకరు నజున్మ నాత్మ దర్శింపు; మనస!

సీ॥ ధర్మమార్గప్రవర్తన మర్థిఁ బాటించి
సత్యబద్ధాత్మాను సరణి మెలఁగి
తనయట్ల సఖిలభూతంబుల నీక్షించి
కేవల సత్త్వచికీర్ష నెనసి
నిరతజాగ్రద్యోగ నిశ్చలమతిఁ బూని
సంతోషయుక్త ప్రశాంతి నెలసి
ప్రకృతియందును మాతృభావంబు నెలకొల్పి
బ్రహ్మమందును బితృభావమూని

తే॥ ద్వంద్వరహిత ప్రశుద్ధభావమున సతము
గర్మఫలమెందుఁగోరక, గాఢతర వి
రాగబుద్ధి బెరసి రాజయోగవగుము;
వేఱుగతు లెల్ల విడిచి యోవెఱ్ఱిమనస!

శా॥ స్త్రీత్యాగంబెనుమీ జగత్త్రయజనమ్మెచ్చెల్గోంము యోజింప, లో
కత్యాగం బొనరించి బ్రహ్మకుయుఁడై కాన్పింము నన్నట్టి యీ
సత్యార్థంబు గ్రహించి తత్పరమతిన్ జ్ఞానప్రబోద్దీపనా
స్నత్యంబంది భజింపు వెఱ్ఱిమనసా! నానాస్వరూపున్ శివున్.

సీ॥ సత్యంబె మాతఁగ, జ్ఞానంబె తండ్రిఁగఁ,
బ్రిధితంపు ధర్మమే భ్రాతగాఁగ,
శాంతియే పత్నిఁగా, క్షమయె పుత్రుండుఁగా,
దయయె ప్రేమంపు మిత్రంబుఁ గాఁగ
భావించి, సంసారబంధ మెల్లను బాసి,
వైరాగ్యమున గురువరుని జేరి,
సగుణ పూర్వక మంత్ర సంయూథ మగు సద్గు
ణధ్యాసయోగ సంధాన మెఱిఁగి,

తే॥ బ్రహ్మమే నీవు, నీవ సూ బ్రహ్మమనుచు,
నతని దయకల్మి స్వానుభవాతినిష్ఠ
నరసి, తత్సౌఖ్య మెల్లప్పు డనుభవింపు;
వేఱుగతు వెల్లవిడిచి యో వెఱ్ఱిమనస!

ఉ॥ త్యాగము చూడ నొక్కనెలవై తగు, నింద్రియ నిర్జయత్వసం
యోగము యుత్తరంబు, మఱియూర్ధ్వము దానికి యోగ్యమైన మా
దాగమ మివ్వసూ భవవిదారణ శీలికి గమ్యభూము లి
ట్లీ గతిఁ దప్పకుండఁ బరమేశు శివున్భజియింపు; చిత్తమా!

శా॥ సంతోషామృత సారపానసుఖిత స్వాంతుండు చూడంగఁ దాఁ
గాంతారంబుననైన నింకను నిజాగారంబు నందైన నొ
క్కఁతాఁ జింత మనంబునం దిడక యక్షోభ్యాత్ముఁడై యుండు; న
చ్ఛాంతినొప్పదము మీఱ నీశ్వరుఁబరున్ ధ్యానింపు మో చిత్తమా

ఉ॥ తొమ్మిది ద్వారము లలుగు తోరపు పుణ్యపురంబునందు స
త్యమ్మగు బుద్ధియే తలఁప సంచిత దీపముఁగా నచింత్యత
త్త్వమ్మున జ్ఞాతయై వెలుఁగువానిఁ బరాత్పరు సర్వసాక్షి ని
క్కమ్మగుభక్తి పెంపున వికారము లేద భజింపు; చిత్తమా !

చ॥ కలయఁగ నెల్లదేహమును, గాంచెడి కన్నులు, విన్న వీనులన్
దలఁచు మనంబు నింక వివిధంబగు నింద్రియవర్గమాచు, ని
ర్మలునిగ, నిర్వికారుఁగ నమాయకుఁగా, సకలైకసాక్షిఁగా,
వెలుఁగు పరాత్పరున్ సతమభిన్నమతిన్ భజియింపు; చిత్తమా

చ॥ కరము ఫలంబుఁగోరకయె కర్మమొనర్చుచు దాని నంచిత
స్ఫురదురుబోధనాగ్ని వడి బూదిగఁజేయుచు నెల్లవేళ ద్వం
ద్వరహిత శుద్ధభావమునఁ దత్త్వవివేకులు యోగదృష్టిచే
దరిసెనముంబొనర్చు పరతత్త్వము నర్థి భజింపు; చిత్తమా !

శా॥ బోధాంభోనిధి మధ్యమందలరు సమ్మోదాఖ్య సౌధంబులో
సాధీయఃక్రియనాడుకన్యక శిరస్స్థానంబునన్వెల్గు స
ద్బోధజ్యోతిరుపేతరత్నముఁ గొనన్ బుద్ధిందలంపూని నీ
యాధివ్యాధులడంగ యోగమును నభ్యాసింపుమో చిత్తమా !

శా॥ లోచూపున్ వెలిచూపునేకముగ నీలోనీవు దర్శించుచుం
బ్రాచీనంబగు వేదసూత్రముల సంభావించి, దుర్వాంఛలం
గ్రాఁచంజేసియు సచ్చిదైక్యపథయోగంబందు వర్తించి ధీ
ప్రాచుర్యంబగు మోక్షమందుటయె సద్భాగ్యంబుసూ చిత్తమా!

మ॥ మమతంగాదె యనేకజన్మములు సంప్రాప్తించె, నానాభవ
భ్రమణత్వంబుఁదొలంగ జేయఁగ మమత్వవ్యాప్తి వీడాడు; మ
త్యమలంబౌ నిజరూపమొందుటకు బ్రహ్మానందసంధాన యో
గము నభ్యాసమొనర్పు, వెఱ్ఱిమనసా! కళ్యాణశీలంబునన్.

సీ॥ అప్రమాదమున భయంబు, క్షమాయుక్తిఁ
గ్రోధంబు, సత్యంపుబోధ నిద్ర,
స్వల్పభోజనమున శ్వాసంబు, సంకల్ప
వర్జనమునఁ గామభావనంబు,
నెంతయు విపుల ప్రశాంత విజ్ఞాన సం
గతి కల్మి రూపఱంగాఁ బొనర్చి,
యమ నియ మాస నాద్యష్టాంగ యోగ సం
కలన నీ ప్రకృతి రోగంబుఁ బాసి,

బట్టబయలౌచు వెలిఁగెడు బ్రహ్మమందు
నీవ నేనను నైక్యంపు టెఱుక నెనసి
యనితర ప్రాప్యత సౌఖ్య మనుభవింపు;
వేఱుగతులెల్ల విడిచి యో చిత్తమనస!

తే॥ పరిణతత్వంబె దృశ్యప్రపంచ మనుచు
నిశ్చయానుభవజ్ఞాన నియతి మీఱ
సంతతా భేద భావ ప్రశాంతబుద్ధి
విపుల భవబంధ మెడపుమో చిత్తమనస!

శా॥ ఏందే నిర్విషయా ప్రలబ్ధ మగు నా యింపే పరబ్రహ్మ 'మా
నందో బ్రహ్మ' యటన్న ప్రాంబలుకు నంతర్బుద్ధిఁ దర్కించి, ని
ష్పందప్రక్రియ బ్రహ్మతత్త్వపద శశ్వద్యోగ సంభావితా
నందోద్యత్సుధఁ గ్రోలి ధన్యతమపంథ న్బొల్పుమో చిత్తమా!

మ॥ ఒకటింబూని జయించి, రెంటినొగి లక్ష్యోత్కృష్టతం జేర్చి, మూ
టికి నాల్గింట మలంచి, యేనిఁటిని బల్ కేవి స్వీదారించి, పై
నిఁక షడ్వస్తుల గుర్తెఱింగి యుఱిగెంతే నిష్ఠమై నేడిఁటిం
బ్రకటస్ఫూర్తిఁ ద్యజించు పూరుషుఁడె సద్బ్రహ్మజ్ఞుఁడో;
చిత్తమా!

ఉ॥ శక్యముగాని యన్యపథసంగతు లేమిటికిన్ ? చతుర్మహా
వాక్యవిచారణంబును శుభస్థిరబుద్ధి నొసర్చి మేలిమా
ణిక్యమువంటి జ్ఞాన పథనిష్ఠ వహించి నిరంతరంబు బ్ర
హ్మైక్యపదంబు నొంది జననార్తిఁ ద్యజించి సుఖింపు; చిత్తమా

శా॥ స్ఫీతంబౌ జగమందు నాత్మయయి, తా జీవాత్మ నెంతేనియుం
జైతన్యంబయి, నాదసంజనిత శశ్వన్మోదమై యెందు న
ద్వైతఖ్యాతి వెలుంగు చుండెడి పరబ్రహ్మంబు నశ్రాంతముం
జేతోవీధి భజింపు మో మనన ! సుశ్రేయోర్థ సంలబ్ధికిన్

చ॥ తలఁపఁగ మాయరూపమగు తత్త్వము లిర్వదియేనువీడి పై
వెలుఁగు ప్రశస్తతత్త్వమున విశ్రుతయోగనిరూఢనిష్ఠచే
నెలమిఁ దదైక్యమొంది, భవమెల్లఁద్యజించి, యదార్థనిత్య సౌ
ఖ్యలలిత సాంఖ్యవేత్తృతఁ బ్రకాశముఁజెందుము నీవు; చిత్తమా!

శా॥ చైతన్యంబు నెఱింగి యోగపథరక్షన్ రాకపోకల్ శుభ
ఖ్యాతింగాంచి యహర్నిశంబు మఱి సోఽహంభావ నిధ్యాన ని
ష్ఠా తాత్పర్యమున న్వెలంగుటయె శశ్వత్త్యాగకంబందు రీ
తిన్ స్ఫీతమతిం బ్రవర్తిలుము, సుశ్రేయోర్థివై చిత్తమా !

ఉ॥ మే లొనఁగూర్పలేనిదగు మిథ్యను బుచ్చక, యేకమాత్రపుం
గాలమునైనఁగాని వృథగాఁ జననీయక, బ్రహ్మనిష్ఠలో
లాలితలీల షోడశకళాపరిపూర్ణమునందు నైక్యసం
శీలనసక్తి నుండుట సుమీ యమనస్కము, నమ్ము; చిత్తమా

చ॥ నలువుగ నెన్మిదంగములు. నాల్గుపదంబులు, మూడుస్థానముల్
చెలువుగఁ బంచదైవములఁ జెన్నగు తత్ప్రణవస్వరూపమున్
నలలిత నిత్య యోగపథసంగతిఁ గాంచెడువాఁడు వేత్త, యి
ప్పలుకుల నాలకించి యటువంటి పదంబునుగాంచు; చిత్తమా !

తే॥ ప్రణవమె ధనుస్సు, మఱి పరబ్రహ్మ మదియు
లక్ష్యమని యప్రమత్తలీలమెయిఁ దెలిసి,
యమ్మువలె నాత్మ తన్మయమై వెలుఁగఁ
దగిన సాధనఁ బూను; చిత్తమ ! సతంబు.

తే॥ అలరును శరీర మనెడు దేవళమునందు
జీవుఁడనెడి సనాతనదేవుఁడాతఁ
డపహృతాజ్ఞానియై సోఽహమని జపించుఁ
దత్పదైక్యంబుఁ గనుము ! చిత్తంబ ! నీవు.

సీ॥ హంస జీవుఁ డతండు సోఽహమ్మైయున్న జీ
వన్ముక్తివడసి కైవల్యమొందు;
నరయ హకారంబు గురుదేవురూపంబు,
పూర్ణబిందువె జీవమూర్తి సుమ్ము,
మఱి సకారంబు సంసరణంబని యెఱుంగు,
మీఁ సంసృతికి నీకు నేఁసియున్న
బంధంబుఁ ద్రెంచి శుంభ న్నిజరూపంబు
సంధించి గురుఁడు మోక్షంబుఁ గూర్చు;

తే॥ గురుని బరమాత్ముఁడనినమ్ము గుఱుతుమీఱఁ;
దా స్వతంత్రుఁడు జీవుఁ డతంత్రుఁడగుట
జ్ఞానసంపదఁ దెలిసి యోగంబుఁ బూను;
వేఱుగతులెల్ల విడిచి యో వెఱ్ఱిమనస !

ఉ॥ సోఽహ మటంచునుంబలుకు హంస, తదర్థమెఱింగినన్ సమ
స్తేహాలు మాని తానె మఱి చిత్తము సత్తయియున్న యద్ధమై
దేహమునందు వెల్గుట మతించి తదైక్యము నొందుఁ; దత్పరా
రోహణముం బొనర్చి ఋతరూఢసుఖంబు గ్రహింపు; చిత్తమా !

శా॥ ఓంకారంబె, యనుత్తమంబుపదమై యొప్పారు బ్రహ్మంబుఁగా
శంకాతంకము లేకనమ్ము; మిఁక నిష్ఠాయుక్తిఁ దద్ధ్యానముం
బొంకంబూని, తదర్థభావనమునం బూర్ణప్రమోదార్ద్వాని
స్సంకల్పస్థితి నీవునీవయగుచున్ జానొందుమో చిత్తమా !

క॥ ఈ కృతి నెవ్వరు విన్నన్
బ్రాకటమతినై లిఖించినన్ జదివిన గౌ
రీ కాంతుఁడు వారికి సు
శ్రీకరముగ జ్ఞానమిచ్చుఁ గృపమీఱంగన్.

సీ॥ శ్రీ మాడుగుల కులక్షీరవారాశి శ
రత్పూర్ణ కల్హార రమణుఁడనఁగ
వఱలు ధీనిధి వీరభద్రసీతారామ
రాట్కవీశ్వరునకుఁ బ్రథితపుణ్య
సన్యాసమాభిద సాధ్వీలలామకుఁ
బ్రథమ పుత్రుండనై పరఁగినట్టి
విబుధవిధేయుండ వేంకట సూర్యప్ర
సాదరా డభిధేయ సంగతుండఁ

సత్త్వవిజ్ఞాని సేవా విధాన పరుఁడ
సద్విషయ సద్గుణాప్తిచే సత్ప్రథంబుఁ
బొందు రహి నిట్లు చిత్తప్రబోధ మనెడి
పేరఁ గృతిఁ జెప్పఁగంటిఁ గామారికరుణ.

ఆశ్వాసాంతము

సీ॥ శ్రీభాగ్యవిభవప్రసిద్ధ మంత్రిని లవ
ధ్వంశాబ్ధి కార్తికీ తార కేంద్ర !

సత్యక్షమాధర్మ శాంత్యహింసానేక
రాజితసద్గుణ రత్నసాంద్ర!
అన్నపూర్ణా జగ్గమాంబాబ్జ నేత్రాప్ని
రూఢమానస నీరరుడ్డినేంద్ర!
కీర్తిప్రభాతిరస్కృత సారరాజము
దేభ తుషార మహీధరేంద్ర!

విమల విజ్ఞాన వైభవ విహాతతంద్రి!
ప్రథిత పూజాప్రతుష్ట మాళీ ధృతచంద్ర!
భవ్యతరభావ ముదిత విపశ్చిదింద్ర!
పుణ్య సత్యనారాయణ బుధగణేంద్ర!

శా॥ శ్రీకైలాసనగేంద్రవాస చరణా శ్లిష్టాత్మ వంశేపహా!
శ్రీకృద్భవ్యతరైకదానగుణ ధిక్కృత్కల్పధాత్రీరుహా!
శ్రీకళ్యాణ మతీథ్యనైజ హితరాడ్వృత్పద్మ పద్మప్రభా!
శ్రీకారుణ్య కటాక్ష వీక్షణ సుధాపాతోరు విద్యప్రభా!

క॥ శ్రీ మన్మంత్రిని వంశాం
భోమ స్నీహారధామ! పుణ్యలలామా!
కామ ముఃఖాంత శ్శతుౖ
స్తోమ నిరాకృతి సమర్థ శుంభద్ధిమా!

ఉ॥ శ్రీయుతసుప్రసిద్ధ కవిశిష్టజనైక విధేయ! సత్యనా
రాయణ నామధేయ! సకలార్థ్రభితుష్టి సమర్థదాన రా
ధేయ! మనోజ్ఞభావన సుధీగుణ సన్నుతిపాత్ర సద్గణా
దాయ! యజస్రవైదిక విధాన సముచ్ఛ్రిత కీర్తినాయకా!

సంపూర్ణము.

# శ్రీ ప్రసాదరాయ కవి

## — వంశావళి —

శా॥ గౌరీశర్వుల పెండ్లిఁ జూచుటకు వేడ్కన్ సర్వసౌరాళి నీ
హారాద్రిస్థలిఁ జేర దద్దిశను వ్రేఁగై భూమియుం గ్రుంగ, నే
ధీరోత్తంసుఁడు మేరునాజ్ఞ యమరాడ్దిగ్భూమిం జేరి యా
య్యారాటంబును మాన్పె, నాఘనుఁ డగస్త్యాఖ్యుండు సామాన్యుఁడే ?

మ॥ స్మరసంహారియుఁ గేశవాబ్జజ శచీజాన్యాది బృందారకో
త్కరమున్ పారిషదుల్ మునీంద్రు లొకవంక జేర వ్రేఁగైన య
ద్ధరఁ దానొక్కఁడె యొక్కచక్కి నతులోత్సాహంబుతో నిల్చినన్
సరియయ్యెన్, సరివానికింక నొకనిన్ వాక్రువ్వఁగావచ్చునే !

ఉ॥ మేరునగంబుతోఁ బెనఁగి మిన్నులు ముట్టుచు సూర్యచంద్ర సం
చారములాపి, లోకములఁ జాల వెతన్గలిగించు వింధ్య న
య్యారె ! నిమేషమాత్రన పదానతుగా నొనరించి మించెనా
కారుణికాగ్రగణ్యుఁడు జగన్నుతిపాత్రుఁడుగాఁడె నిత్యమున్ ?

శా॥ వాతాపీల్వలగర్వభంజనుఁడు శర్వాణీశపాదాంబుజ
ధ్యాతేందిందిర మింద్రముఖ్యసుర సంఘాతార్చితుం డాశ్రిత
వ్రాతాభీష్టద పంచపర్ణమను కీరశ్రేష్ఠవాసాయిత
స్ఫీతస్వీయమనోజ్ఞపంజరుఁడు, సంసేవ్యుండు ధీరాళికిన్.

శా॥ ఆదివ్యర్షివరేణ్యగోత్రము సముద్యద్దీప్తిఁ గావింప, న
య్యాదోరాశిని రత్నసంచయము, నీహారాద్రియందోషధుల్,
ప్రాదుర్భావము నొందు చందమున, సౌరాష్ట్రద్విజశ్రేణిలో
శ్రీదైవార జనించినారు గిరిశాంఘ్రిద్వంద్వసేవారతుల్.

క॥ ఇల మాడ్గుల వారన వా
రల శ్రీకాకుళ మండలాంతర్గతమై
కలుములగీ మనఁ దగు బొం
తలకోడూరున వసింత్రు ధర్మాత్మకులై.

ఉ॥ ధీరులు పండితోత్తములు దివ్యగుణాకరు లాధిలోకమం
దారు లుదారు లిద్ధకవితా రమణీకమనీయ చిత్తసం
చారులు చారువాగ్ధృత రసజ్ఞులు ప్రాజ్ఞులు శ్రీశిలాక్షరా
దారులు మాడ్గులాన్వయులు తత్సములే భువిఁ గల్గ రెవ్వరున్.

శా॥ సౌరాష్ట్ర ద్విజనామశోభిత మహింసాసత్య శౌచ ప్రతి
ష్ఠారూఢంబగు పట్టుశాలికుల మెంచంగాఁ బ్రకాశ్వన్మ హా
గారం బిష్టసుగంధబంధురము నై కన్పట్టినట్లొప్పె న
య్యారే! మాడ్గుల వంశ సంకలితమై సాభోగ ప్రఖ్యతిన్.

క॥ ఆ మాడ్గులాన్వయమున మ
హామహుఁ డొకఁ డుద్భవించె నార్యాహ్లాదమే
శ్యామల పద పంకజ సే
వా మానితగుణుఁడు విజయబాలయ నాఁగన్.

సీ॥ సంతత సర్వజ్ఞ సహవాస యోగ్య వి
భ్రాజిత శీలుఁ డీ రాజరాజ
కుచ్ఛిత కవి శిష్యకోటి సంస్తంభితో
దాత్తాఖ్యుఁ డీ పురుషోత్తముండు
గురువరానుజ్ఞానుసరణప్రమోదితో
ద్వృత్తాత్ముఁ డీ విబుధేశ్వరుండు
ప్రవితత భాషాప్రపంచ నిర్మాణాన
ప్రారంభుఁ డీ చతురాననుండు

తే॥ సత్సమూహోవ నా త్తయశః పత్రికాస్యఁ
డీ కళానిధి యనుచుఁ ద న్నెల్లజనులుఁ
బొగడ నెగడొందె నగణితామోఘ మధుర
సదయ మృదులభాషి విజయబాలయ మనీషి.

మ॥ కవిలోకంబితఁ డిద్ధకావ్యఘట నాఖండప్రభావుండటం
చు విశేషంబుగఁ బ్రస్తుతుల్సలుప నీ సూరివ్రజశ్రేష్ఠుఁడున్
సవినోదస్థితిఁగూర్చె (శ్రీ) శివపురాణంబున్ శివస్తోత్రమా
ర్గవరంబౌ శతకంబు మంజుల పదార్థప్రౌఢ భావంబులన్.

శా॥ ఆ పాండిత్యనిధానుసోదరుఁడు సమ్యగ్వర్తనుం డీశ్వర
శ్రీపాదప్రవణాంతరంగుఁ డఖిలార్థివ్రాత సంరక్షణ
వ్యాపారుం డనఘుం డనన్యతర విద్యారాజతుం డంచితా
లాపప్రస్తవనీయుఁడైన కులాలంకారుఁ డిమ్మేదినిన్.

ఉ॥ శ్రీయుతమూర్తియాతఁడు విశిష్టతరంబగు సప్తసంతతుల్
సాయక భూమినిల్పెనని పల్కుచునుండు సహస్రజిహ్వలన్
శేషు యని వాని కీర్తిసుమకోమలి, నేటికి నా విచిత్ర రా
మాయణ కావ్యతన్విని సముంచితవైఖరిఁగూడి ప్రేముడిన్.

క॥ ఘనుఁడైన విజయబాలయ
యనుకూలప్రియచరిత్ర యగు రామాంబా
తనుమధ్యయందుఁ బొందెను
ననఘాచారుం గుమారు నమలాకారున్.

క॥ ఆ యనఘుఁడు దారుగుణగణ
శ్రీయుతుఁడై వీరభద్ర సీతారామా
రాయాభిదుఁడై సజ్జన
గేయుండై సాటిలేని కీర్తి గడించెన్.

మ॥ జననీభవ్యపతివ్రతాత్వఫలమో చర్చింప ధన్యాత్ముఁడౌ
జనకుం డార్జనసేయు పూర్వజననాంచత్పుణ్యమో నాఁగ న
య్యనఘాత్ముండు సమస్తవిద్యలను బాల్యంబాదిగా నేర్చి తా
ఘనసాహిత్య కవిత్వ తత్త్వములఁ బ్రఖ్యాంగాంచె నుద్యద్గతిన్.

ఉ॥ నీతికిఠావు, సూనృతము నిల్కడ, శాంతపుదీవి, సర్వవి
ద్యాతతి కాలయంబుఁ, బ్రిమువాన్విత సత్కవితా సతీ కటా
క్షాతత వీక్షణాళికి గృహంబు, సుహృజ్జనమైత్రికిక్క, ప్ర
స్ఫీత మహేశభక్తికి నివేశము, తద్ఘనుఁడెన్న నల్పుఁడే!

మ॥ వరసాహిత్యకళాకలాపుఁడయి శాన్వద్దానధౌరేయుఁడై
నిరవద్యామిత సత్ప్రబంధరచనా స్వీతస్థిరప్రజ్ఞుఁడై
గిరిశారాధనతత్పరుండయి సదాంగీకృతసుహృద్బంధుఁడై
ధరఁ జెల్వొందె సమందకీర్తి సితఁడేతన్మాత్రుఁడే చెప్పఁగన్

క॥ వరసఫణితి "గీతాద్య
క్షర నిర్మితనామ తారకావళి" కృతిఁ దా
విరచించి తండ్రి కంకిత
మురుభక్తి నొనర్చి కీర్తి నుర్వి నెసంగెన్.

చ॥ ఉరుతరసాహితీగరిమ నుగ్రకుమార చరిత్రమాది భా
సురతర సత్ప్రబంధములు నూరిజనుల్వినుతింపఁజెప్పియా
వెరవరి నైజసంఘు మభివృద్ధినొనర్పఁగఁ "బట్టుశాలి" యన్
వరమగు పత్రిక న్నిలిపి వారని సేవ నొనర్చె జాతికిన్.

క॥ శృంగార తిలక నామము
రంగారెడి కావ్యకన్య రాజితగుణ కీ
ర్త్యంగనకున్ బాసటగాఁ
బొంగుచు నాతండు గొనియె బుధనుతసరణిన్.

మ॥ ధర మర్త్యుండయి పుట్టినందులకు సత్సాంగత్యమున్ భక్తియున్
స్థిరమౌ దానగుణంబు బంధుహితమున్ శ్రీశంభు సంసేవయున్
కర మార్జించుట యోగ్య; మే నరుఁడు హృత్కంజాతమందింతనీ
పరమార్థంబులనిల్పఁ డాతనిఁగనం బాపంబు చేకూరదే ?

చ॥ నరునకు విద్య, విద్యకుఁ గనన్వినయంబు, నయప్రవృత్తికిన్
పరమబుధేంద్రసంగతియు బాగుగదానికి దానధర్మముల్
కరము విభూషణంబులయి గ్రాలుచు నాతని నింమనందు సు
స్థిరతర భోగభాగ్యములఁ జేకుఱఁజేయు యదార్థ మింతయున్.

చ॥ వరగుణులైన యీ విజయబాలయ పుత్రికఁజెప్పి చెప్పనీ
ధరణి నొకండు లేఁడు, విదితంబుగ నేత దమోఘ సద్గుణో
త్కరములు మూర్తిమంతమయి గన్పడె నాఁగ సుహృజ్జనౌఘ హృ
త్సరసిజసంచయంబులకు సంతసమున్గలిగించు నిత్యమున్.

మ॥ కృతులెన్నేని రచించి పండితజను ల్గీర్తింపఁగా భాష క
ప్రతిమానోద్వలధీ విధానమున సేవంజేయు టేకాల దాఁ
గృతులెన్నేనియుఁబొంది సత్కవుల కర్థిఁజేసె నాపుష్పవ
త్స్థితమౌ షోడశదానముల్ ఘన యశశ్శ్రీనిల్పఁ గల్పాంతమున్.

తే॥ కలివరుఁడుఁ బండితుండుఁ ద్యాగప్రసిద్ధుఁ
డైన యీ పుణ్యశీలున కలరు మేల్మి
బంగరున రంగుగ నమర్చు వజ్రమట్లు
నలువ జేకూర్చి మించె సన్యాసమాంబ.

శా॥ చేతోవృత్తి నిరంతరంబును పతిశ్రీపాద సంసేవనా
స్వ్యాతంబై చెలువొంద, బాంధవజను ల్వేనోళ్లఁగీర్తింప సం
ప్రీతిం బెట్టుచు నీప్సితాన్నముల నర్థివ్రాతముం బెంచుచున్
పాతివ్రత్యనిధానయై మెలఁగు నప్పద్మాక్షి నిష్పంకయై.

మ॥ దినమా పుణ్యవతీలలామ భగవద్గీతాది వేదాంత శా
స్త్ర నికాయంబుఁ బఠించుచున్ వికసితస్వాంతాబ్జయై మానసీ
య నితాంతామృత సౌఖ్యపూరమగు బ్రహ్మజ్ఞాన మార్జించి త
జ్జని ధన్యంబొనరించి మించెను సుహృత్సంఘాత సంస్తుత్యయై.

క॥ ఆ పుణ్యదంపతులకు మ
హా పురుషులు పుట్టి రిర్వు రాత్మజు లింద్ర
శ్రీపతులు కశ్యపునకు సు
రూప యగు నదితికి నొదవు రూఢి మెఱయఁగన్.

తే॥ జగతి వేంకట సూర్యప్రసాద రాట్క
వీంద్రుఁడన జ్యేష్ఠసుతుఁడు మహిష్ఠయశుఁడు;
మఱి ప్రతాప సింహరాయ నిరుపమాభి
ధానమున నొప్పు రెండవ తనయుఁడంము.

క॥ వా రిర్వు రన్నదమ్ములు
శ్రీరాజత్సుగుణ గణ విశిష్టులు శివభ
క్త్యారూఢులు పుణ్యాత్ము లు
దారులు విద్యావినయ విధాన నిధానుల్.

ఉ॥ అందుఁ బ్రతాపసింహకవి ఆంధ్రకవిత్వకళావిలాస శో
భందనరారి ధర్మయుతభావము సత్వచోనిబంధనం
బందముఁగూర్ప నగ్రజునియందునఁ బ్రేమయు భక్తివెల్గనా
నందమునంజరించు సుజనప్రకరంబు నుతింపనిచ్చలున్.

శా॥ సీతారామునిపేర నొక్క శతకశ్రేష్ఠంబు నిర్మించి సం
ప్రీతిన్ దుష్కలికాలవర్తన కృతిన్ సృష్టించి భావావళిన్
ఖ్యాతింగాంచె, నిజాన్వవాయసుయశఃకాంతుల్ విజృంభింప; వి
ద్యాతాత్పర్యగుణానుమోద ధిషణావ్యాలోల చేతస్కుఁడై.

ఉ॥ వారక వాని యగ్రజుఁడు భవ్యవిచిత్ర కవిత్వ తత్త్వ వి
స్తార సుధాసరిద్వర విశంకట తుంగ తరంగ డోలికా
స్వైర విహారణప్రియుఁడు, శాంతిదయాది సమస్త సద్గుణా
స్ఫార మణిప్రకాండ సురశైలమనన్ గణనీయుఁడై మనున్.

శా॥ ప్రాసంబున్ యతియున్ గణంబు మరిదా భావింపనట్టుల్ నిరా
యాసప్రక్రియమైఁ దమంతనవి యొయ్యంజేరి వెల్గొంద ధీ
వ్యాసంగస్థితి నాశులీల శతపద్యంబుల్ రచించుచున్ మరే
రీ సాటెన్నఁ బ్రసాదరాయకవి కుర్విన్ ధీరలోకంబునన్.

తే॥ శారదాంఘ్రి సరోరుహాస్థగిత భర్మ
వలయ ఘంటా నినాద ప్రపాదయుక్తి
విశదపరచుఁ ద దాశుకవిత్వధాటి
వానితోఁ సామ్యుఁ డెవఁ డాంధ్రవసుధయందు.

సీ॥ తత చతుర్విధ కవిత్వప్రౌఢిమ మెలర్చు
రహి భగవత్ స్తోత్రరాజ కృతియు
భాషాసతీమాళి భూషణప్రాయమై
పొలుపొందు కవిశిరోభూషణంబు
అనువాద పటుశక్తి నాడించు పోల్కిఁజె
లఁగు పుష్పబాణవిలాస మొకటి
జ్యౌతిష ముఖ్యప్రశస్తాంశములఁ గూడి
సవురొందు జ్యోతిష చంద్రికయును

సంస్కృతాంధ్ర భాషలయందు సాటిలేని
చాటు ధారాశుధారాను సంగతముగఁ
గావ్యములు వ్రాసి మివులఁ బ్రఖ్యాతిఁగాంచె,
ఘనుఁడు నూర్యప్రసాదరాట్కవివరుండు.

తే॥ అచ్చ తెనుఁగు బొనఁగఁ బూర్ణమగు నిఘంటు
వరయ నొకఁడు గల్గమి నకారాదిసరణి
వసుధ శుద్ధాంధ్ర శబ్దార్ణవంబు పేర
సంఘటించి వెలింగె ప్రసాదరావు.

చ॥ సురుచిర ధీ విశేషమున సూరివరేణ్యసభాంతరంబులన్
దఱచు శతావధానము లదభ్రగతిం బొనరించి మించి య
వ్వరగుణుఁ డున్నతంబులగు పండిత సత్కవిరత్నముఖ్యస
ద్బిరుదములన్ బహూకృతులఁ బెక్కఁగడించుచునుండె నంతయున్.

తే॥ విజయనగర సత్కవి సభా పృథ్వియందు
ఆశుకవిచక్రవర్తి విఖ్యాతిఁగాంచి
బంగరపు గంటకడియంబు బహుమతిఁగొని
సంస్తుతివహించి మించెఁ బ్రసాదరావు.

ఆ॥ వె॥ ధరణి జనులమెప్పుఁ దగఁ గాంచి వెలుఁగొందు
నా ప్రసాదరాయు నాత్మపత్ని
కనకలక్ష్మినామకమున నంబిక పేర
సంతతం బెనంగు సద్గుణాఢ్య.

తే॥ ధనకనక వస్తువాహన ధాన్య ముఖ్య
బహువిధ మనోజ్ఞ భాగ్య సంభరితమగుచు
నొప్పు దుంపాన్వవాయ పయోధిఁ బుట్టె
వనజగేహినివోలె తత్కనకలక్ష్మి.

సీ॥ పతిని దైవమువోలె భావించి పూజించు
నంతర్బహిశ్శుచి నావహిల్లు
గురు దైవముల పూజ గురుతుమై నొనరించు
మఱి బంధులందుఁ బ్రేమంబు నింపుఁ

బొరుగిండ్లకెన్నడుఁ బరుగిడఁగాఁ బోదు
దుష్టకాంతల చెల్మి కిష్టపడదు
పుట్టిన యింటికి మెట్టిన యింటికి
మేటి యశస్సూరా మెలఁగుచుండు

సత్యధర్మంబు లెదనిల్పి సందడించు
దీనులందు దయాబుద్ధిఁబూని వెలయు
మంచిచెడ్డ లెఱింగి సమ్మతిఁ జరించు
కమ్ర సద్గుణ లక్ష్మి ఆ కనకలక్ష్మి.

మ॥ కవితాతత్వరసజ్ఞయై వెలయు నా కంజాతపత్రాక్షి త్రా
ధవుసాన్నిధ్యమునన్ తదీయ రచనాతాత్పర్య మొందాత్మయై
కవితా లక్షణ లక్ష్యముల్ దెలిసి సత్కావ్యైకసందర్భస
ప్రవిధానార్జిత సాహితీయుతమతిన్ వర్తిల్లు నశ్రాంతమున్.

శా॥ స్ఫారోదార విలాసభాసురమతిన్ వాగర్థముల్ గ్రాలె సు
శ్రీ రమ్యప్రథితాంగియా కనకలక్ష్మీదేవియున్ తద్విభుం
డై రాజిల్లు ప్రసాదరాయఁడు జనాహ్లాదాను సంధానశీ
లా రాజద్గుణయుక్తి వెల్గుదురు జాలన్ ధారుణీమండలిన్.

ఉ॥ తాతయుఁ దండ్రియున్ సుకవితారచనన్ ధరణీతలానఁ బ్ర
ఖ్యాతివహించి సర్వకవికాండముచే నుతులందినారు, త
ద్రీతిఁ బ్రసాదరాయకవిధీరుఁడు పండితుఁడై వధానియై
ఖ్యాతి గడించు టబ్బమె మహత్తర సత్ప్రతిభావిశేషతన్.

క॥ ఏతాదృగమల గుణ వి
ఖ్యాతునకును భారతీ పదాంగద నినద
ద్యోతక నూతన మృదు కవి
తా తత్వజ్ఞునకు సకల ధర్మజ్ఞునకున్.

క॥ ఘన విజయనగర పండిత
జన దత్త విరాజమాన చామీకర కం
కణ సంస్థిత ఘంటాని
స్వన సంహృత కుకవిగర్వ సంరంభునకున్.

క॥ విలసిత సద్గుణ గణమణి
వలయాభరణాభివినుత పాతివ్రత్యో
జ్వలభావ (నాంబికాఖ్యా) కనకలక్ష్మీ
లలనా లసమాన ముఖ జలజ దినమణికిన్.

క॥ శ్రీ మాద్గలాన్వయాంబుధి
సోమునకు మనోజ్ఞగుప్త సోమకళా భ్యా
న్నామునకుఁ గుకవిజలభృ
ద్భీమునకుఁ బ్రసాదరాట్కవి లలామునకున్.

శా॥ ధీమత్సంస్తుత సాహితీమహిత సత్ప్రయూషధారా సు
రామాధుర్య ధురీణ మంజుల వచఃప్రాజ్ఞా ప్రభావక్రియా
సామీచీన్య కవిత్వ తత్త్వ విలస త్సర్వోత్తమ ప్రౌఢ కృ
త్సామర్థ్యంబు శతావధానచణ మేధాశక్తి సంధించుతన్.

మ॥ రవిచంద్రక్ష్మవితాన మా దివమునన్ రాజిల్లు నందాక న
త్కవిచూడాభరణంబు నా ఘనసమాఖ్యాతాంధ్రగీర్వాణ ధీ
రి వివేకస్థిర చిత్తదానగుణ సుశ్రీ భోగ భాగ్యాయు రు
త్సవముల్ గూరుచుగాత! శంకరుఁడు భావానీశ సేయించుతన్.

ఇట్లు,

సాపేటి నరసింహము దేవర,
కలాడ. (శ్రీకాకుళము జిల్లా).

# నీలకంధరాష్టకమ్.



శ్లో— శుభప్రసిద్ధికారణం - కృపారసైః పూరణమ్,
భవాబ్ధిమగ్నతారణం - నమామి నీలకంధరమ్.

శ్లో— విధీంద్రముఖ్యదేవతా - శిరఃకిరీట రత్నభా
విరాజితాంఘ్రినీరజం - నమామి నీలకంధరమ్.

శ్లో— విశేషసౌఖ్యకారిణం - స్వభక్తచిత్తచారిణమ్,
ధరాభరాపహారిణం - నమామి నీలకంధరమ్.

శ్లో— నిరస్తదుఃఖ నారకం - శ్రితార్తలోక తారకమ్,
కుమార్గచార మారకం - నమామి నీలకంధరమ్.

శ్లో— ఫణీంద్ర చారు భూషణం - సుధావిలాస భాషణమ్,
సమస్తపాప శోషణం - నమామి నీలకంధరమ్.

శ్లో— అనంతసౌఖ్య నీతకం - విధూతసర్వ ఘాతకమ్,
అనాదిమధ్య జాతకం - నమామి నీలకంధరమ్.

శ్లో— పవిత్రయుక్తి వాచకం - విభాసిఫాల పాచకమ్,
సమానురక్త మోచకం - నమామి నీలకంధరమ్.

శ్లో— మనోజ్ఞదివ్య సుందరం - సువేష్టశైల కందరమ్,
సుధీసముద్రి మంధరం - నమామి నీలకంధరమ్.

శ్లో— సూర్యప్రసాదరాయేణ శ్లోకాష్టక మిదం కృతమ్,
శ్రీ నీలకంధరస్తోత్ర నామకం భక్తిధామకమ్.

---

